# రాజ ముకుటం

(చారిత్రాత్మక నాటకము)

రచన:

పండిత గోవింద వల్లభ పంత్

అనువాదం:

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి, బి. ఏ.



నవభారతీ ప్రచురణలు

ప్రకాశకులు:

యస్. ఆర్. అండ్ సన్స్

విజయవాడ-2.

# రాజముకుటం

[ ఇందు వచ్చు పాత్రలు ]

| | |
|---|---|
| 1. విక్రమసింహుడు | మేవాడ్ మహారాజా |
| 2. ఉదయసింహుడు | విక్రమసింహుని తమ్ముడు |
| 3. వనవీరుడు | శీతలసేని పుత్రుడు |
| 4. కర్మచందు | ప్రధానమంత్రి (వృద్ధుడు) |
| 5. జయసింగు | కర్మచందు పుత్రుడు |
| 6. రణజిత్తు | ఒక లోధి సర్దారు |
| 7. బహద్దూర్ సింగ్ | పన్నాభర్త - దక్షిణహస్త మాన్యుడు - సిపాయి |
| 8. చందన్ | పన్నా పుత్రుడు |
| 9. ఈశకర్ణుడు | డూంగరపురపు రాజు |
| 10. ఆశాషాహుడు | కమల్మీర్ దుర్గాధిపతి |
| 11. చందావత్ | ఒక సర్దారు |
| 12. ఈశకర్ణుని సేనాపతి | |
| 13. వారీ | |
| 14. యోగి | |
| 15. పన్నా | ఉదయసింహుని దాది |
| 16. శీతలసేని | వనవీరుని తల్లి |

—×—

"గృహలక్ష్మి"

నుండి పునర్ముద్రితము

గృహలక్ష్మికి

కృతజ్ఞులము





## గమనిక

ఈ నాటకమును ప్రదర్శించ దలచినవారు ముందుగా మా అనుమతినిగాని, లేక గ్రంథకర్తగారి అనుమతినిగాని పొందవలయును. అట్లు గాదేని మేముగోరు నష్టపరిహార మివ్వవలసియుండును.

కంభంమెట్టు సత్యనారాయణరావు,

ప్రచురణ కర్త.

# రాజ మకుటం

## ప్రథమాంకం

### ఒకటవ దృశ్యము

[ చిత్తూరు రాజా విక్రమసింహుని విలాసభవనం - మేజామీద సురాపాత్ర ఉంటుంది. విక్రమసింహుడు దుఃఖసూచకమైన ముఖంతో ఎడమ చెంపమీద అరచేయి మోపి నిలబడి ఉంటాడు. ]

విక్రమ : మానవజీవితము క్షణికం. (ఉత్తేజితుడై) నా సుఖేచ్ఛలు ఈ జన్మలోనే ఎందుకు ఫలించవు? మనస్సులో చింతామాలిన్యాన్ని ఎందుకు పోషించుతున్నాను?

[రణజిత్ ప్రవేశిస్తాడు.]

రణ : ఆ మాలిన్యాన్ని దీనితో కడిగివేయండి ప్రభూ! (సురాపాత్ర ఎత్తి విక్రమున కందిస్తాడు)

విక్రమ : అది సురాపాత్ర! రణజిత్, ఇటు తే. సర్దారులందరిలో నీవే నా మేలు కోరుతున్నవాడివి. పానీయములన్నింటిలో ఇదే ఎంతో ఉపయోగకరమైనది. క్షణికజీవితమా! ఇక నీవిచారాన్ని మరచిపో. ప్రాపంచిక సుఖభోగాల్ని ఎంతవెలకైనా కొనితీరుతాను. (సురాపాత్ర అందుకుని త్రాగుతాడు)

దుఃఖిని : (తెరలో) రక్షించండి, రక్షించండి.

విక్రమ : ఇప్పుడేమి రక్షణ! ఇప్పుడు విక్రముడు సురాపానమత్తుడు. ఇప్పుడేమీ లాభంలేదు. మరొకసారి నేను ప్రశాంతంగా ఉన్నప్పుడు రా. లేదా వెళ్ళిపో. వెళ్ళిపోయి ఆగుంపులో చేరు– విక్ర

ముడిచేత పీడింపబడి, అతన్ని రాజ్యభ్రష్టుణ్ణి చేయాలని చూస్తున్నవాళ్ళ గుంపులో ...

రణ : (కత్తి పెరికి లక్ష్యము కల్పించుకుని) జాగ్రత్త ! నీవు దేవేంద్రుడవైనాసరే, మా విక్రమునిమీద ఈగ వాలనీకుండా ఇక్కడ ఈ రణజిత్ ఉన్నాడు; తెలుసునా ?

విక్రమ : భేష్, నీ విక్కడే వున్నావుకదూ, రణజిత్ !

రణ : చిత్తం, రణజిత్ తమ సేవకుడే.

విక్రమ : అయితే యేమీ భయం లేదన్నమాట.

రణ : నా బొందిలో ప్రాణముండగా ఏమీ లేదు.

విక్రమ : ఏదీ, మరొకసారి పాత్రనింపి ఇవ్వు; తాగేస్తాను. ఇప్పు డేమీ భయం లేదుకదూ! (రణజిత్ పాత్ర నింపి విక్రముడికి ఇస్తాడు )

(విక్రముడు తాగుతుంటాడు. దుఃఖిని తన ఇద్దరు బిడ్డల్ని ఎత్తుకుని ప్రవేశిస్తుంది.)

దుఃఖిని : రక్షించండి, రక్షించండి. (పిల్లల్ని నేలమీద దింపుతుంది)

విక్రమ : ఎవరది ?

దుఃఖిని : దుఃఖ పీడిత, విపత్తాడిత.

విక్రమ : అభాగినీ ! ఎందు కీ వివాదస్వరం తెచ్చావు నా మధురగాన ప్రపంచంలోకి ?

దుఃఖిని : చిత్తోడుకులభూషణా ! ఇదా వింటున్నాను తమనోటివెంట. సదా తమ వంశము మావంటి దీనుల ఆర్తికి చెవి యొగ్గేది.

విక్రమ : నేనుమాత్రం ఏమీ వినను. ఈ వంశమునం దిక మీ సుఖ గీతికానాదం మ్రోగదు. అట్టే వాగితివా — తెలుసునా ? నా ఈ ఉత్సవగీతాన్ని తారామండలంవరకూ వ్యాపింపజేసి అందులో నీ ఏడుపు అంతర్లీనం చేస్తాను.

దుఃఖిని : బాగా చెప్పారు. మహారాణా ! దేశంలో ప్రతిమూలా కరువు వ్యాపించి ఉంది. ప్రజలు ఆకలిమంటతో విల విల కొట్టుకుని చచ్చిపోతున్నారు.

విక్రమ: చూవసీ, వాళ్ళవంటలు నే నేమన్నా కోసుకున్నానా! నే నేమి మేఘాధిపతినా?

దుఃఖిని : రాజా! నేను బిచ్చమెత్తుకుని జీవించేదాన్ని. అక్రమంగా తమ ఉద్యోగులు నా పాక దోచుకుని ఒక్క మట్టిపాత్రకూడా మిగల్చకుండా ఎత్తుకుపోయారు. ఏం చేయను?

రణ : ఏదైనా పాడుపడ్డ దేవాలయంలోకి వెళ్ళి నీ భగ్నభాగ్యం కోసం దీపారాధన చేసుకో; వెళ్ళు; వెళ్ళిక్కడినుంచి.

దుఃఖిని : నువ్వు రాజుగారి కపటమిత్రుడవు. నువ్వే ఆయన్ని చెడు మార్గానికి త్రిప్పుతున్నావు. పట్టాభిషేకసమయమప్పుడు విక్రమసింహ మహారాణా ఈలాగున లేరు. నేను రాణాముందు న్యాయభిక్షుకురాల్ని. (ఒడి పట్టుతుంది.)

విక్రమ : పో, పో, వెళ్ళిపో.—ఇదే నా న్యాయం. వెళ్ళగొట్టవోయి రణజిత్!

[రణజిత్ జబర్దస్తీగా దుఃఖిని సమీపిస్తాడు. అతని హంగామా చూచి ఆమె బిడ్డలు ఏడుస్తారు.]

విక్ర : ఈప్రకారంగా ఇక ఎవర్నీ లోపలకు రానీయవద్దు; తెలిసిందా?

దుఃఖిని : ఇదేనా మహారాణా న్యాయం. సంగ్రామసింహునితో నే చిత్తోడు కులగౌరవం సమాప్తమయిందా! మేవాడ్ మిత్రుడంతరించాడా!

విక్రమ : ఎవ్వరా అక్కడ? ఈదౌర్భాగ్యురాల్ని వెళ్ళగొట్టండి.

[ద్వారపాలకుడు వస్తాడు. అతడూ రణజిత్ యిద్దరూ కలసి ఆమెను, ఆమె బిడ్డల్ని గెంటివేస్తారు.]

ద్వార : చిత్తము (నిష్క్రమిస్తాడు.)

విక్రమ : ఏమిటి! చాటున ఉండి, చిత్రపుబొమ్మలవలె చూస్తూ, నిశ్శబ్దంగా ఉండిపోయారు?

(నాట్యకత్తెలు నిల్చిఉన్న ఇరువంకలా చూస్తాడు. వాళ్ళు ముందుకువచ్చి నాట్యమారంభిస్తారు.)

భైరవి - త్రితాళం

ఈ వలపు తమి కేమయ్యేదనో - నా తలపు లెపుడు నెరవేరెడినో;
నా మధుపాత్రిక నాథునికొరకే - అంచులొలుకగా నింపుకొంటినే;
ఆస్వాదింపగ సఖి! రాడేమే!—ఇది ఎపుడో ఒలికిపోవునేమో;
ఏమని వనమాలిని దూరి, ఏమి ప్రయోజన మిపుడు;
ఇంతగ అవమతి చేసినవాని, అంతుచూడనా ఎపుడో;
నా మొలనూలున కట్టుకపోవుదునో;
సుందర శ్యామ స్వరూపము చూపి
తొందరగా వచ్చెదనని పలికి;
ఎందుకు రాడే! యిప్పటికీ
దుస్సహ మీ మధుర-బాధ యెదలో.

(తెరలో లాఠీకర్రలచప్పుడు. నాట్యకత్తెలు భయపడి పాట ఆపివేసి పారిపోతారు.)

ఒకడు : (తెరలో) ఎందుకు పోనియ్యావు?

రెండవ : (తెరలో) రాజు మారాజు; తోవయివ్వు.

మూడవ (తెరలో) చూస్తారేం! లాఠీ తీసి చితకకొట్టండి.

(నలుగురు-ప్రజలు ప్రవేశిస్తారు.)

మొదటివాడు : ఈకరువునుంచి, దుష్టవ్యాధులనుంచి మమ్మల్ని రక్షించండి.

రెండవ : మీరాజ్యంలో విధింపబడ్డ హెచ్చుపన్నులు తగ్గించండి.

మూడవ : మోసగాళ్ళు, దొంగలు, దోపిడిగాళ్ళు తమ ఉద్యోగులు-వీళ్ళబాధలు పడలేకున్నాం, అభయ మివ్వండి.

నాల్గవ : అన్యాయాల్ని అణచివేయండి. న్యాయపాలన చేయండి.

రణజిత్ : న్యాయమేమిటి? ఇది న్యాయస్థానమనుకున్నారా?

మొదటి : రణజిత్ నీవు మాట్లాడకు. నీఅబద్ధాలు మమ్ముల్ని శాంత పరచలేవు.

రెండవ : న్యాయాలయ మంటున్నా వేమిటి? చెప్పు, అది ఎక్కడుం దేమిటి?

విక్రమ : నా మనస్సిప్పుడు అమృతగానతరంగాలమీద స్వర్గవిహారం చేస్తున్నది. ఏమిటిది, మీరు వచ్చి నరకద్వారం తెరిచారు! ఛండాలులు! వెళ్ళండి ఇక్కడనుంచి —

రణజిత్ : ఔను, వెళ్ళండి, వెళ్ళండి. అలసి ఉన్న మహారాణావారి మనస్సు విశ్రాంతి పొందవలసిన సమయ మిది. మీరు వచ్చి కోలాహలం చేయటానికి కాదు. (వాళ్ళను నెట్టబోతాడు).

మూడవ : జాగ్రత! రణజిత్, మధ్యన నీవు కల్పించుకు రాకు.

విక్రమ : ఎవ డా అక్కడ! ద్వారపాలకుడు లేడూ?

నాల్గవ : మమ్మల్ని లోపలికి రానీయకుండా అడ్డగించినందుకు ద్వారపాలకుణ్ణి తగినట్లుగా శిక్షించి వచ్చాం.

విక్రమ : (కత్తి పెరికి, క్రుద్ధుడై) వచ్చి నన్ను హింసించాలని చూస్తున్నారా? ఛండాలురు! మిమ్ములను ప్రాణాలతో విడిచిపెట్టను.

మొదటి : అందుకు మే మేమీ విచారపడము.

రెండవ : మేము కోరేదీ అదే. బ్రతికి వుండి ఏమి సుఖపడుతున్నా మని.

(రాణాముందు శిరస్సువంచి నిలబడతాడు. విక్రముడు కత్తి ఎత్తి కొట్టబోతుంటాడు. నలుగురు సర్దార్లతోసహా కర్మచందు ప్రవేశించి రాజుగారి హస్తాన్ని పట్టుకుంటాడు.)

కర్మచందు : సావధానులుగండి మహారాజా! నిర్ధనులు, నిరపరాధులు, ఆయుధ రహితులునైన ఈ ప్రజలమీదనా మీ కరవాలం? వీరి నిష్కళుష రక్తంతో పదునుపెట్టి దాన్ని మళ్ళీ ఎక్కడ ఉపయోగించుతారు?

విక్రమ : ఎవరు? ప్రధానామాత్యుడా? యిది రాజసభ కాదు. నా విలాస భవనం. ఇక్కడ నా ఇచ్ఛ ప్రతిఘటించే అధికారం ఎవరికీ లేదు. ఈ వధ్యులకు ప్రాణదండన విధించి తీరుతాను.

కర్మచందు : అయితే తమ రాజసింహాసనము అచలమని భావించకండి. దాని కాధారములై వీరి భుజాలు ఉన్నవి. కాబట్టి ఆలో

చించుకోండి. మీరు తమ కర్తవ్యాన్ని మరచినా నేను మరువను. నేను వీరిని రక్షిస్తాను, చంపనీయను.

విక్రమ : నన్నిప్పుడు అడ్డగించినవాడు నా కత్తికి మొదటిబలి కాక తప్పదు.

కర్మచందు : అయితే కొట్టండి. తమ బాహువులలో శక్తి, తమ కరవాలంలో తీక్ష్ణత ఉన్నట్లయితే - ఇదిగో ప్రతికేశమూ మేవాడ్ సేవయందే పలితమైయున్న ఈ వినత శీర్షము మరింత వినతము చేస్తున్నాను. (తల వంచుతాడు)

విక్రమ : సిద్ధముగానే ఉన్నాను.

(కత్తి ఎత్తుతాడు - జయసింహుడు ప్రవేశించి తండ్రిగారిని రక్షించేందుకు ఆకత్తిని పెరికి విక్రమునిపై దెబ్బతీయబోతాడు.)

జయసిం : జాగ్రత !

(ఇంతలో వనవీరుడు కత్తిదూసి ప్రవేశిస్తాడు- జయసింహుని కత్తివేటును తన కత్తిపై తీసుకుంటాడు.)

వనవీరుడు : జాగ్రత ! విక్రముడు నాకు మిత్రుడు, సోదరుడు. అతని మీాద దెబ్బతీయడానికిముందు నా కత్తి పదును జూడవలసి ఉంటుంది.

కర్మచందు : (జయసింహుని కత్తి దింపి) ఏమిటి నాయనా యిది !

జయసిం : తండ్రిగారిపట్ల నేను నిర్వర్తించవలసిన కర్తవ్యం. మరేముంది ?

కర్మచందు : వద్దు, వద్దు. విక్రముడు నాఒడిలో పెరిగాడు. అతడూ నాకు నీవంటివాడే. నామీాద అతడు కత్తి ఎత్తినమాత్రాన ఏమయింది? నన్నతడు చంపలేదు. నీ వది మరచిపో.

జయసిం : మరచిపోనా ? నాన్నగారూ ! మీారెవరెవర్ని మరచిపొమ్మంటారు ? ఎవరికి మరుపొస్తుంది ? అటు చూడండి, ఆ ప్రజల దుర్దశ.

ప్రజలు : శరణు... శరణు...

జయసిం : వీరి యీ దశ చూచి మేవాడ్ రాజ్యపు భవిష్యత్తు ఊహించండి. ప్రజ లెంతవరదాకా శాంతి వహిస్తారు ?

ప్రజలు : రక్షించండి... రక్షించండి...

జయసిం : (సర్దార్లతో) చూచారుకదా ! రాణాగారి హృదయంలో ప్రధానమంత్రిపట్లనే యిటువంటి ఆదరభావం ఉన్నప్పుడు మీ మాట చెప్పనక్కరలేదు. ఏమిటి మీ కోరిక ? మేవాడ్ సింహాసనంమీద న్యాయరహితుడైన రాజు ఉండటం మీ కిష్టమేనా ?

సర్దారులు : సింహాసనము శూన్యముగా ఉండటమే మేలు.

జయసిం : (ప్రజలతో) మీ కోరి కేమిటి ?

ప్రజలు : మా కష్టాల్ని తొలగించండి.

జయసిం : విక్రమునివల్ల తొలగవు.

మొదటివాడు : మరింకేదైనా వుపాయం —

ఒకసర్దారు : మరొక వుపాయం ఏముంది? విక్రముని సింహాసనము నుండి తొలగించడమే

జయసిం : ఔను. అదీ ఒక వుపాయమే. పదండి, దాన్ని గురించి ఆలోచిద్దాం.

కర్మచందు : నాయనా! ఏమిటది?

జయసిం : మిమ్మల్ని అవమానించినందుకు ప్రతీకారం. పదండి; మేవాడ్ దేశకల్యాణం కోరేవారంతా పదండి. నేను మీకు సుఖ మార్గాన్ని చూపించుతాను.

(జయసింహుని వెనుక సలుగురు సర్దారులు, ప్రజలు, కర్మచందుకూడా వెళ్ళతారు).

వనవీరుడు : నేనూ వస్తున్నాను. నా సోదరుడైన విక్రమునిపట్ల నీవేమి వైషమ్యము నెరపుతావో! (నిష్క్రమిస్తాడు).

విక్రమ : అందరూ వెళ్ళిపోయారు. రణజిత్! నీవూ వెళ్ళవేం?

రణజిత్ : రణజిత్తు ఎందుకు వెళుతాడు మహారాజా! ఏ దేమీ తమ శత్రువా!

విక్రమ : కేవలం ఒక్క మిత్రుడివల్ల ఏమౌతుంది? రణజిత్! నీవూ వెళ్ళిపో; నేను సురాదేవిని సేవిస్తూ ఒంటరిగానే వుంటాను ఈ భవనంలో. (ఆసనముపై కూర్చుని సురాపానం చేస్తాడు.)

రణజిత్ : (తలపై చేతులుంచి కొంతసేపు ఆలోచన చేసినమీాదట) ఔను. మీరు చెప్పింది బాగానేవుంది. ఆ విద్రోహుల రహస్యాల్ని సంగ్రహించటానికైనా నేను వెళ్ళవలసిందే. వెళ్ళుతున్నాను. (నిష్క్రమిస్తాడు).

విక్రమ : వెళ్ళిపో; విక్రముడి కేమీా భయములేదు. సర్దార్లంతా విద్రోహులైనారు. ప్రజలంతా విద్రోహులైనారు. ఇంకెవరేనా మిగిలి వున్నారా?

( శీతలసేని ప్రవేశిస్తుంది. )

శీతలసేని : ఆ.

విక్రమ : ఎవరు?

శీతలసేని : వనవీరుని మాత, రాణీ శీతలసేని.

విక్రమ : రాణి శీతలసేని! రాణి! హ హ్హ హ్హ హ్హ!

శీతలసేని : ఏమిటా వ్యంగ్య హాసము? మహారాజా, మీా పినతండ్రి పృథ్వీరాజు భార్యనుకాదూ నేను?

విక్రమ : ఎందుకంత శ్రమపడి ఇలా వచ్చావు పాపం?

శీతలసేని : యాచనకేమీా కాదు. నా హక్కు పొందగోరి వచ్చాను.

విక్రమ : ఏమిటది?

శీతలసేని : మీాకు తెలుసును. మహారాణా సంగ్రామసింహుడు నాకూ, నా కుమారుడు వనవీరునికీ నియమితముచేసిపోయిన మాసికవృత్తి మా కెంతకాలమునుంచి లభించటములేదో- ఎన్నిసార్లు అడిగి విఫలురాలి నైనానో.

విక్రమ : మాసికవృత్తి ఇవ్వకపోతే ఏమి? ఆకలిమంటతో చచ్చిపోతున్నావా?

శీతలసేని : చచ్చిపోవటంమాట అటుంచు. సావధానుడవై ఆలోచించు. నే నడగటం న్యాయం కాదా ?

విక్రమ : అవచ్చు. కాని ప్రస్తుతం వెళ్ళిపో. ఇప్పుడు బొక్కసంలో డబ్బులేదు. మరొకప్పుడు చూస్తాం.

శీతలసేని : అలా వల్లకాదు. నాకు రావలసింది పొందకుండా ఇక్కడ నుంచి కదలను. ఎంతకాలమని సహిస్తాను నీ అన్యాయాన్ని ?

విక్రమ : ఏమి అన్యాయం చేశాను ? (ఆసనం విడిచి లేస్తాడు)

శీతలసేని : మా ధనంతో నీ భోగానుభవసంబారాల్ని కూడబెట్టుకుంటున్నావు

విక్రమ : తెలుసునా ఎవరితో ప్రసంగించుచున్నావో ?

శీతలసేని : క్రూరునితో... బందిపోటు దొంగతో...

విక్రమ : జాగ్రత ! నీ వంశాన్ని జ్ఞాపకం తెచ్చుకో నీచ దాసీ ! నీకా ఇంత సాహసం ?

శీతలసేని : నేను నీ పినతండ్రి భార్యను, నీకు మాతృ సమానురాలిని. ఈ అవమానజనక శబ్దాన్ని జ్ఞాపకముంచుకో విక్రమ్ ! నీవు నాగ సర్పము తోక త్రొక్కావు.

విక్రమ : దాని ఫణముకూడ నుగ్గుమాడుతాను.

శీతలసేని : అంతకన్నముందే నేను నీ ముకుటాన్ని చూర్ణము చేస్తాను. నీ సింహాసనాన్ని బోరగిలవేస్తాను. నిన్ను సర్వనాశనం చేసి మరీ విడిచిపెడతాను.

(కోపముతో పాదములు నేల చరచి నిష్క్రమిస్తుంది. మరొకవైపునుంచి పన్నా శాంతభావయై మెల్లమెల్లగా ప్రవేశిస్తుంది.)

పన్నా : ఎవరు ! ఆ భయంకర అభిశాపమూర్తి ! సర్వనాశనం చేస్తావా ! అయితే బలియిచ్చుకునినైన రక్షించగల శక్తి నాకబ్బునుగాక ! సంగ్రామసింహుని వంశానికా యీ దావానలం ! దీన్ని నా రక్తం ధారపోసియైనా చల్లార్చెదనుగాక !

విక్రమ : ఎవరమ్మా ? దాదీ, పన్నా ...!

పన్నా : మహారాణా !

విక్రమ : అమ్మా! ఎట్లు రక్షిస్తావో మేవాడ్ రాజ్యమంతా నాకు ప్రక్కలో బల్లెమైపోయింది ఈనాడు. (వినతు వెళ్తాడు)

(విచారంగా వనవీరుడు ప్రవేశిస్తాడు.)

వనవీరుడు : సర్వనాశనము !! సర్వనాశనము...!!!

విక్రమ : ఏమి జరిగింది వనవీర్ ?

వనవీర్ : సర్దారులంతా విద్రోహులైనారు. వారు నీకు ఆజన్మ కారాగారము విధించి, నన్ను సింహాసన మెక్కించాలని చూస్తున్నారు.

విక్రమ : మరి నీవు ?

వనవీర్: నీకు హాని కలిగించి నేను ఇంద్రపదవినైనా స్వీకరించలేను.

విక్రమ : నీవూ నిజమైన మిత్రుడంటే. ఇందాక నీ ప్రాణాన్నిగూడ లెక్కచేయకుండా జయసింహుని దెబ్బనుండి నన్ను రక్షించావు కావూ ? వనవీర్ ! ప్రతిజ్ఞ చెయ్యి.

వనవీర్: భగవానుడు ఏకలింగమూర్తి సాక్షిగా ప్రమాణము చేస్తున్నాను—"నేను విశ్వాస ఘాతుకము చేయను."

(కత్తి ఎత్తి ప్రతిజ్ఞ చేస్తాడు. పన్నా ఆశ్చర్యము నటిస్తుంది. స్థిర దృశ్యము.)

## రెండవ దృశ్యము

(వనవీరుని భవనం—శీతలసేని పాడుకుంటూ ప్రవేశిస్తుంది)

కాఫీరాగం - జంపెతాళం

అవమాన దవాగ్ని
నాచిత్తములో దరికొనుమీ.
క్షాత్రవుల తేజమ్ము క్షయము కావాలి
భయ భోపములు నన్ను - వదలిపోవాలి.
అదృష్టము పట్టాలి.

శీతల : రాజమాతను కావాలన్న ఈకోరిక ఎన్నాళ్ళనుంచి నా హృదయంలో మెదలుతున్నదో చెప్పలేను. సమయ మిప్పుడు అను కూలముగా కూడివచ్చింది. విక్రముడు నాకు గావించిన అవమా నమే నన్ను మాన్యపదవి కెత్తగలదు. విక్రమునిస్థానే వనవీరుని మహారాణాను చేయడానికి సర్దారంతా గట్టిపట్టుదలతో ఉన్నారు. నేను రాజమాత నౌతాను.

(రణజిత్ ప్రవేశిస్తాడు) 9199

రణ : మరి నేనో ?

శీతల : విన్నావూ? బలే చతురుడివిసుమా! నీవు ప్రధానమంత్రివి అవు తావు. కాని అందుకు నీవేమైనా ప్రయత్నాలుచేస్తున్నావామరి!

రణ: విక్రముడికి తెలియకుండా ప్రజల్లో ఈవిప్లవాగ్ని రగిల్చింది నేనే. ఆయనసమక్షంలోమాత్రం మిత్రుడులాగ కనిపించేవాణ్ణి. ప్రజల దుఃఖాన్ని తొలగించాలనే ఆందోళనలో ఆయన ఉన్నప్పుడల్లా పరిపూర్ణ సురాపాత్ర చేతి కందించేవాణ్ణి.

శీతల : నీవంటివాడి సహాయంవల్ల నా ఆరంభం- సందేహంలేదు- ఫలిస్తుంది.

రణ : కాని నాభయమేమంటే అంతా అయినతరువాత నేను మీకు జ్ఞాపకముంటానో ఉండనో.

శీతల: ఏమీభయములేదు రణజిత్! కావాలంటే వ్రాసికూడాయిస్తాను. (వ్రాసి యిస్తుంది. (

రణ : చదవనీయండి (కాగిత మందుకొని చదువుతాడు) "రాణి శీతల సేని రాజమాత అయేందుకుగా సర్దారు రణజిత్తు సహాయం చేసే యెడల అతనికి మేవాడ్ అధిపతి వనవీరునివద్ద ప్రధానమంత్రిపదవి మంజూరుచేయబడుతుంది."

—శీతలసేని.

(కాగితం జాగ్రత్తగా మడిచి జేబులో పెట్టుకుంటాడు.)

శీతల : కాని రణజిత్! మన మెన్నడూ అనుకోవకుండా అనుకోని విఘ్న మొకటి తటస్థించింది.

రణ : ఏమిటమ్మా అది.

శీతల : (విచారంగా) వనవీరుడు విక్రమునికి ప్రాణమిత్రుడు. అతన్ని సింహాసనం దింపించి తాను రాజ్యపదవి స్వీకరించటానికి మన మెంతచేసినా ఒప్పుకోడు.

రణ : అయితే వాళ్ళిద్దరిమధ్యా విరోధలతిక మొలిపించటం ఈ సేవకునికి ఎడమచేతి ఆట!

శీతల : అది ఈరోజే మొలవాలి, పుష్పించాలి, ఫలించాలికూడాను. ఇదిగో ఈ కటారు పుచ్చుకుని అక్కడెక్కడైనా దాగిఉండు. (కటారు యిస్తుంది) వనవీరుడు ఇప్పుడే ఈవైపు వస్తాడు. రాగానే అతన్ని వధించే...

రణ : (కటారు విసిరివేసి, ఆర్తోక్తితో) వద్దు తల్లీ, వద్దు. ఇదా తీరా మీరు ఉపదేశించుచున్నది?

శీతల : అతన్ని వధించేంత హంగామా చెయ్యి; అంతే. అతన్ని కిందపడవేయుటం, కటారుతో పొడవబోవటం, తంత్ర రచన.

రణ : ఓహో ఇప్పుడు తెలిసింది. (నేలమీది కటారు తీసుకుంటాడు)

శీతల : ఆసమయాన నేను వెనుకనుంచివచ్చి నీకత్తిఎత్తిన చేయి పట్టుకుని నిన్ను బంధించుతాను.

రణ : (అదిరిపడి దూరంగా పరుగెత్తుతాడు. మళ్ళీ కత్తి కిందపారేస్తాడు. రెండుచెవులు మూసుకుంటాడు) ఆరి భగవంతుడా! బంధించి ఉరితీయించుతావు; అంతేకదూ! ఈపని నావల్లకాదు తల్లీ.

శీతల : అయితే ఆ లిఖితపత్ర మిటుతే. దానితోపాటు మంత్రిపదవిమీద ఆశకూడ వదులుకో.

(పత్రముకోసం చెయి చాపుతుంది.)

రణ : ఉహుఁ; ఇది యిచ్చివేయుటం నా కిష్టంలేదు.

శీత : అయితే మంత్రిపదవిమీద నీకింత తీవ్రవాంఛ ఉంటే, నిళ్ళల్లో నిప్పుల్లో ఉరకటానికికూడా సిద్ధపడి ఉండాలి.

రణ : సరే. చెప్పమ్మా. అది ఎటువంటి మహాసాగరమో, ఎటువంటి అగ్నిగుండమో చెప్పు. ఒక్కసారిగా దూకేస్తాను.

శీతల : దీన్ని తీసుకో; నిండా కప్పుకో. (ముసుగొకటి యిస్తుంది) నేనున్నానుగా నీ విముక్తికి ఉత్తరదాతను.

రణ : భేష్; ఇప్పుడు బాగా తెలిసిపోయింది. అయితే ఇదేమంత కఠినమైనపని కానేకాదు. ఇక చూద్దురుగాని ఈరణజిత్తుగాడి హస్తకౌశలాన్ని.

శీతల : ఇది కప్పుకొని ఆగదిలో దాగివుండు. మాటలధోరణిలో పెట్టి వనవీరుని ఇక్కడే నిలిపేస్తాను. కొంతసేపైనతర్వాత నీకు సైగ చేసి వెళ్ళిపోతాను. అప్పుడు నీవు తటాలున వనవీరునిపై దుమికి అతన్ని కిందపడవెయ్యి. తక్షణమే నేను నీకు మద్దత్తుగా పరుగెత్తి వస్తాను. త్వరగా వెళ్ళు, అదిగో వనవీరుడు వస్తున్నట్టున్నాడు.

రణ : అలాగే (నిష్క్రమిస్తాడు)

శీతల : ఛీ, ఛీ... ఎంత అవమానం! (వనవీరుడు వచ్చి వింటూ వుంటాడు) నువ్వు నన్ను జుట్టుపట్టి లాగావు... దాసి, వేశ్య, అన్నావు. హా! భగవంతుడా !! నా పుత్రుడు వనవీరుని భుజాల్లో బలం లేదూ ?

వన : (ప్రవేశిస్తూ) మాఅమ్మకు అవమానమా ? ఎవడా సాహసుడు?

శీతల : ప్రతీకారం నెరపగల పౌరుష రక్తమేనా నీ నరాల్లో ప్రవహించేది ?

వన : ఎందుకు కాదు ? (కత్తి దూస్తాడు)

శీతల : మాతృఋణ ముంచుకొని సత్పుత్రుడనిపించుకో. ఈ క్షణమే విక్రము డెక్కడున్నాడో అన్వేషించు. అతడే నీ తల్లిని 'వేశ్య' అన్నాడు. స్వాభిమానం అంచులువారివున్న ఆ మస్తకాన్ని మొండెమునుండి వేరుచెయ్యి.

వన : (కత్తి విసిరిపారేసి) అట్లనకమ్మా! విక్రముడు పరాయివాడా? నావంటి పుత్రుడేకదూ! కొడుకు ఎప్పుడూ తల్లిని అవమానించడు. తల్లి సదా కొడుకు దుడుకుతనాన్ని క్షమిస్తుంది.

శీతల : క్షమా? వనవీర్, క్షమించమంటున్నావా? హా! భగవంతుడా! ఇప్పటికి తెలిసివచ్చింది, నేను వంధ్యను; నావడిలో పుత్రుణ్ణి కాదు పెంచింది, పంజరంలో పక్షిని అని.

వన : ఈఅగ్నికణంమీద గాలికాదమ్మా విసరవలసింది; ఇన్నినీళ్ళు చిలుకు. పద; విక్రముడు నీకాళ్ళమీదపడి క్షమాపణవేడుకుంటాడు. ఈకరవాలము మేవాడ్ శత్రుసంహారమునకుమాత్రమే ఉపయోగపడుగాక.

(నేలమీదనుంచి కత్తి అందుకుని ఒరలో పెట్టుకుంటాడు.)

శీతల : మేవాడ్‌కు శత్రువు లెవరున్నారిప్పుడు విక్రముడుతప్ప. నీవు తల్లికి జరిగిన అవమానాన్నికూడా సహిస్తావు; పోనీ, ప్రజల దీన దశకు విచారమైనా కలగటంలేదూ నీకు?

(జయసింహుడు నలుగురు సర్దారులతో ప్రవేశిస్తాడు.)

జయ : నీవు మా తీర్మానంగురించి ఆలోచించుకున్నావుకదూ, వనవీర్! విక్రముని సింహాసనం అధిష్ఠించేందుకు సిద్ధంగావున్నావా, లేదా? ఏం చెబుతావు?

వన : రాజమకుటహీనుడై విక్రము డేమౌతాడు?

జయ : కోటలోని అంధకారకారాగృహంలో ఉంటాడు. ఆమరణాంతమూ చేసినపాపాలకు ప్రాయశ్చిత్త మనుభవిస్తాడు.

వన : నీతండ్రిగారి ఉద్దేశమూ అదేనా?

(కర్మచందు ప్రవేశిస్తాడు.)

కర్మ : ఔను, నాయనా! నాజన్మంతా ఈమేవాడ్ సేవయందే వినియోగిస్తున్నాను. మనరాజ్యముపట్ల నాకెన్నడూ అహితచింత లేదు.

వన : విక్రముని, చిన్నతమ్ముడు ఉదయసింహు డున్నాడు. అతడికి పట్టాభిషేకం చేయండి.

కర్మ : అలా కాదు. ఉదయుడు కేవలం పసివాడు. అతనికి వయసు వచ్చేవరకు మేవాడ్ రాజ్యాధిపత్యం నీవే వహించాలి.

వన : మరి విక్రముడు రాజమకుటముకూడా పోగొట్టుకొని కారాగారమందే ఉండవలసిన ఆవశ్యకత ఏమిటి?

కర్మ : కారాగారపు కష్టాలు అతన్ని పశ్చాత్తప్తునిచేసి సన్మార్గానికి తిప్పవచ్చు. మేవాడ్ రాజ్య కళ్యాణముకోసమై అధికసంఖ్యాకులైన శుభచింతనులు అట్లే నిశ్చయించారు. నీవు మా తీర్మానాన్ని మన్నించినందుకు సంతోషం. మంచిది. మేము వెళ్ళి నీ పట్టాభిషేకోత్సవము ప్రకటిస్తాము. (పోతారు)

వన : కాని...

శీతల : (అడ్డువచ్చి) ఊరుకో! మేవాడ్ రాజ్యకళ్యాణ కార్యక్రమమున 'కాని' శబ్దం రాకూడదు.

(కర్మచందు, జయసింహుడు, సర్దార్లు నిష్క్రమిస్తారు)

వన : చాలా వికట సమస్య! సమ్మోహనచణమైన సువర్ణ రాజమకుటము!

శీతల : (అప్పటికప్పుడు) మంచిది, ఇక నేను వెళ్ళుతున్నాను.

(దాగివున్న రణజిత్తుకు సైగచేసి వెళ్ళిపోతుంది. ఛద్మవేషంతో రణజిత్తు కటారు పుచ్చుకొని ప్రవేశిస్తాడు. వెనుకనుంచి హఠాత్తుగా వనవీరునిమీద దూకి పడతాడు. వనవీరుని క్రింద పడేసి కటారుఎత్తిన తక్షణమే శీతలసేని ప్రవేశించి కటారు లాక్కొని రణజిత్తును పారిపొమ్మని సైగ చేస్తుంది. రణజిత్తు పరుగెత్తిపోతాడు.)

వన : ఎవరు?

శీతల : నరపిశాచం! ఘాతకుడు! పరుగెత్తి పారిపోయాడు. పట్టుకోండి! పట్టుకోండి!

(ఘాతకునివెంట పరుగెత్తబోతుంది. కాని వనవీరు దామె చేయి పట్టుకొని ఆపుతాడు)

వన : అమ్మా, నీవు నన్ను రక్షించావు, వాడు పారిపోతే పోనీలే.

శీతల : ఆశ్చర్యంగా వుందే! నిన్ను హత్యచేయుటానికి వచ్చినవాడెవడు? (కటారుపై దృష్టి నిలుపుతుంది)

వన : నాకు శత్రువు లెవరూ లేరు.

(ఛద్మవేషం తీసివేసి రణజిత్తు ప్రవేశిస్తాడు)

రణ : విక్రముడుతప్ప. వనవీర్! అంత తెలుసుకోలేకుండా ఉన్నావేమయ్యా! సర్దార్లంతా కలిసి నిన్ను తన సింహాసనంమీద నిలబెట్టాలని చూస్తున్నట్లు విన్నప్పటినుంచీ విక్రముడు నిన్నెలాగైనా రూపుమాపాలని ఆలోచిస్తూనే ఉన్నాడు.

శీతల : సందేహం లేదు, ఈ ఘాతకుని పంపించింది విక్రముడే.

వన : అదా సంగతి! ఆనాడు రాజసభలో నే నతని ప్రాణాలు కాపాడానే!

శీతల : అట్లనుకోకు. ప్రపంచమంతా అంతేలే! మేవాడ్ సింహాసనాధిష్ఠానమునకు సిద్ధపడు. నీ మార్గములో ఆటంకములుగాఉన్న వారిని నులిమివెయ్యి.

వన : అమ్మా! అట్లాగే చేస్తాను. అతడు నన్నవమానించాడు. జనకతుల్యుడైన వృద్ధమంత్రిని - కర్మచందును తిరస్కరించాడు. ప్రజల్ని అనేక విధాల కష్టపెట్టాడు. ఇవాళ అతడే నా ప్రాణాల్ని కూడా మింగివేయ దలచాడు. నీప్రతీకారేచ్ఛ, సర్దార్ల బలవంతం, ప్రజల హాహాకారాలు, నా ప్రాణాలమీద తీపి, ఇవన్నీ మేవాడ్ సింహాసనాధిష్ఠానమునకు నన్ను పురిగొల్పుతున్నవి. చెప్పమ్మా, రాజమకుట మెక్కడున్నది ?

(వనవీరుడు, అతని వెనుకనే శీతలసేని, రణజిత్తు నిష్క్రమిస్తారు)

[ తెర పడుతుంది ]

## మూడవ దృశ్యము

(ఉపవనములో చిత్తేశ్వరి ఆలయం - పన్నా చేతులు జోడించి ప్రార్థన చేస్తూ ఉంటుంది.)

కీర్ రాగం — త్రితాళం

పన్నా : నీ రుచిరమూర్తి హృద్దేహములో
నీ స్తుతిగీతిక అధరోష్ఠముపై
నీ ధ్యానంబే విచారములలో
నీ పూజామాలిక చేతులలో.

(ఎడమవైపునుంచి ఉదయుడు ప్రవేశిస్తాడు)

ఉదయుడు : ఆదిదేవతివు పరమేశ్వరివీ

(కుడివైపునుంచి చందన్ ప్రవేశిస్తాడు)

చందన్ : రుద్రాణివి విలయాంతకారిణివి
పన్నా : తారల్లోనూ. పూవుల్లోనూ, ఉదధిలోననూ ప్రతిబింబితవూ
ముగ్గురు : నీ ధ్యానంబే విచారములలో నీ పూజామాలిక చేతులలో

(ఉదయుడు, చందన్ నిష్క్రమిస్తారు)

పన్నా : నీ రుచిరమూర్తి హృద్దేహములో నీ స్తుతిగీతిక అధరోష్ఠముపై

(ఉదయుడు ప్రవేశిస్తాడు)

ఉదయుడు : అణు అణువుననూ నీ మహిమా

(చందన్ ప్రవేశిస్తాడు)

చందన్ : అడు గడుగుననూ నీ గరిమా
పన్నా : రాత్రిసమయముల తమస్సు నీవే - భాను కిరణముల వెలుతురు నీవే
ముగ్గురు : తేజము తమమూ నీవే సుమ్మా
సమ విషమములూ నీవేనమ్మా
ఉద : ఆకాశములో నీలిమ నీవే
చందన్ : సమరభూమిలో కాళివి నీవే
ఇద్దరు : నీధ్యానంబే విచారములలో
నీ పూజామాలిక చేతులలో

(ఒకప్రక్క ఉదయుణ్ణి ఇంకొకప్రక్క చందన్‌ను తీసుకుని పన్నా ముందుకు సాగివస్తుంది.)

పన్నా : మీరిద్దరూ ఒకేచెట్టునుంచి వ్యాపించిన రెండు కొమ్మలు, ఒకేకొమ్మన వికసించిన రెండు పుష్పాలు, ఒకేపూవునుంచి వుద్భవించిన రెండు కాయలు.

ఉద : ఆ రెంటికీ నీ వేకదమ్మా ఆధారం.

పన్నా : నా కున్నది ఒక్కటే కోరిక. మేవాడ్ రాజ్యం నిత్యమంగళంగా ఉండాలి. అందుకే నే ననేకసార్లు మాత చిత్తోడేశ్వరీ ఆలయంలో ప్రార్థన సలిపాను. సంగ్రామసింహుని వంశానికి గౌరవ కీర్తులు ప్రాప్తించుగాక ! మేవాడ్ ప్రజలకు సుఖ మౌగాక !

చందన్ : సంగ్రామసింహుడు మన ఉదయుని తండ్రి గదమ్మా? ఆయన పేరు మాకు చాలాసార్లు వినిపించావు. కాని మానాన్ననుగురించి ఎన్నడూ చెప్పనేచెప్పవేం ? సంగ్రామసింహరాణా సైన్యంలో ఒక సైనికుడుగా ఉండేవాడని ఎప్పుడో చెప్పావు, అంతే.

పన్నా : ఔను. ఆతరువాత ఆయన కనవాహాయుద్ధానికి తన దక్షిణ హస్తం ఉపహారంగా ఇచ్చి సైనికవృత్తి మానేశారు. గుజరాతు సుల్తాను చిత్తోడును ధ్వంసంచేసి మనప్రాణాల్నితప్ప ఏమీ మిగల్చలేదు. అప్పుడు నువ్వు చాలాచిన్నవాడివి

చందన్ : అదంతా నాకుతెలుసు. అంతకంటే ఎక్కువ తెలుసుకోవాలని నాకోరిక. నాన్న ఎక్కడున్నాడమ్మా! నా చిన్నతనంలో చెబుతూండేదానివి: ఆయన ధనంసంపాదించేందుకు విదేశాలు వెళ్ళాడని. మళ్ళీ ఎప్పుడొస్తాడు?

పన్నా : ఏమిజవాబుచెప్పను నాయనా !

ఉద : ఆయన విదేశాలువెళ్ళారని ఇదివరకుమోస్తరుగా ఇప్పుడు చెప్పటంలేదు నీవు. వెళ్ళేటప్పుడు నీతో చెప్పివెళ్ళలేదా ఆయన?

పన్నా : లేదు. భర్తృవియోగం ప్రాప్తించిన ఆ నిశి ఇప్పటికీ, ఇంతకాలం గడచినతర్వాతకూడా జ్ఞాపకంవచ్చినప్పుడల్లా భయావహంగా ఉంటోంది.

ఉద : అసలాయన ఎందుకు వెళ్ళాడో ?

పన్నా : దరిద్రతాదుఃఖవికలుడై. అంతకంటె ఇంకేమి కారణం ఉంటుంది.

ఉద : నీమీదా, చందన్ మీద ప్రేమ తెంచేసుకునే?

పన్నా : ఔను తండ్రీ! మావిషయకమైన చింత ఆయన కష్టుడు లేక పోయింది. భగవంతునిమీద విశ్వాసమే నశించింది ఆయన కష్టుడు. [కంఠంనుంచి ఒకతాయెత్తు తీసి] ఈతాయెత్తు ఎప్పుడూ ఆయనకంఠాన చూస్తూండేదాన్ని. ఆయన మాతో చెప్పకుండా ఇల్లువిడిచిపోయిన రాత్రి తెల్లవారుఝామున నాకిది ద్వారందగ్గర పడిఉండగా దొరికింది. ఆయన మళ్ళీ ఎప్పుడో తిరిగివస్తారనే ఆశతో దీన్ని నాటినుంచి ధరిస్తూ వచ్చాను. ఇకనుంచి నీవు ధరించుకోరా చందన్! ఇది నీకు రక్షాకవచ మౌగాక! [తాయెత్తు చందన్ మెడలో కడుతుంది.]

చందన్ : నేను దీన్ని ఎక్కడా పారవేసుకోకుండా జాగ్రత్తగా ఉంచు కుంటా.

ఉద : నీవు మరి తిరిగి మాకోలువులోకి ఎప్పుడొచ్చావు?

పన్నా : నేనట్లా నిస్సహాయునై ఉన్నప్పుడు నీతండ్రిగారి దర్శానికి వచ్చాను. ఆయనకు నాపై దయగలిగి నిన్ను పెంచేభారం నాకు వప్పచెప్పారు.

ఉద : ఆయన నీకెప్పుడేనా జ్ఞాపకం వస్తారా?

పన్నా : జ్ఞాపకంరానని యెల్లాచెప్పను? కాని మీ ఉభయుల అధర పల్లవాలమీద హాసచంద్రికల్ని చూచినప్పుడు నా అశ్రుబిందువులు ఇగిరిపోతవి.

చందన్ : అమ్మా! నాన్నగారి సమాచారం ఏమీ తెలియడమే లేదా?

పన్నా : నన్ను తగినవార్తలేమీ రావడంలేదు. కొందరు దోపిడీ దొంగల్లో చేరాడని, కొందరు బైరాగి అయిపోయాడని, మరి కొందరు...... [కంఠావరోధం]

చందన్ : వద్దమ్మా! ఆ మూడోమాట చెప్పనేవద్దు. అలా జరుగదు.

అది అబద్ధం. మానాన్న ఎక్కడో దూరాన్నుంచి నన్ను పిలుస్తో న్నట్టుగా నాగుండెలో వినబడుతున్నది. 'రారా, చందన్!' అంటున్నాడాయన. నే నాయన కంఠాన్ని కౌగలించుకుంటాను తప్పకుండా; ఎప్పుడోమాత్రం చెప్పలేను.

ఉద : అమ్మా, ఇన్నాళ్ళనుంచి ఏమిటో మరి నా కర్థంకాకుండా ఉంది. మహారాణాకు, సర్దార్లకు మధ్య అంత విద్రోహం పెరిగి పోయిందేం? రాజసభ వ్యాపారాలు నియమితంగా జరగటమే లేదు. ప్రజ లెందుకో అంత అసంతృప్తిగా ఉన్నారు.

పన్నా : దీని కంతకూ ఒక్కటే కారణ వస్తువు. ఏమిటో అది సరిగా అవగతం కావటంలేదు.

ఉద : (తెరవేపు చూస్తూ) అదుగో మహారాణా, ఇటే వస్తున్నారు. ఆయన్నే అడుగుదాం. జయము జయము చిత్తోడేశ్వరునికి.

(మహారాణా విక్రమసింహుడు ప్రవేశిస్తాడు)

విక్ర : నన్నడిగి ప్రయోజనంలేదు ఉదయ్! నాకు మెడమీద తలే భారంగా తోస్తున్నది. ఈ తలపై చిత్తోడు రాజమకుటము ధరించటానికి యోగ్యత లేదు.

ఉద : ఎంతమాటన్నారు మహారాణా?

విక్ర : నేను సత్యమే చెబుతున్నాను ఉదయ్! విక్రమసింహుడు సుఖపడనీ, పడకపోనీ— చిత్తోడురాజ్యానికి మంగళ మవశ్యము కావలసిందే.

పన్నా : మహారాణా, తమ రెందుకో ఇవాళ చాల వ్యగ్రులై ఉన్నారు?

విక్ర : అందుకు నీ వేమీ విచారపడకు పన్నా! సర్దార్లు నన్ను సింహాసనభ్రష్టుని చేయాలని నిశ్చయించారు. నేను వారికన్నా ముందే ఈ చిత్తోడురాజ్యమకుటాన్ని నీకు వప్పజెప్పి పోయేం దుకు వచ్చాను. (మకుటము చేతిలో పట్టుకొని) ఉదయ్! ఎంత కాలమువరకు నీ చిన్నారి మస్తకం ఈ మకుటధారణముకు ఉప

యుక్తము కాదో అంతవరకు, పన్నా! ఈ మకుట రక్షణభారం కూడా నీదే.

(మకుటము పన్నా కీయబోతాడు. క్రోధావేశంతో వనవీరుడు ప్రవేశిస్తాడు)

రావోయి వనవీర్! ఈ సమయములో నీవుకూడా ఇక్కడ ఉండటము అవశ్యకమే; కాని అదేమిటి? మాట్లాడవేం? నీ కన్నుల్లో క్రోధారుణచ్ఛాయ కమ్మింది? చివరకు నీకూ నామీద కోపంమే?

వన : నోరుమూయ్! విక్రమ్, నీ కపటస్నేహం బయలుపడక తప్పింది కాదు. పాపం! ఎందుకు వచ్చానో నీకు తెలియదేం?

విక్ర : నా రాజ్యంలోని యీ విద్రోహాగ్నిని ఉపశమింపచేయడానికేదయినా మంచి ఉపాయము చెప్పేందుకు వచ్చావనుకొంటున్నాను. నిజం!

వన : కాదు, కాదు. నా ప్రాణవాయువులనైనా ఊది దాన్ని గగనచుంబిని చేసేందుకు; శాంతికోసంకాదు, యుద్ధానికి వచ్చాను.

విక్ర : యుద్ధానికా? మనిద్దరమూ ఒకేపక్షంకదూ?

వన : కాదు. మనిద్దరమూ ఒకరొకరికి శత్రువులం.

విక్ర : నీకంఠధ్వని భయావహంగావుంది. ఈ నీ రోషానికి ఆధారం? ఇంతతొందరలో ఈవిషమ భావపరివర్తనకు కారణం?

వన : గుండెమీాద చేయివేసుకుని నిన్నే ప్రశ్నించుకో. నిన్నిప్పుడు వధించటానికే వచ్చానని నేను చెప్పటం న్యాయకర్ణములకు అపశృతిగా వినిపించదు.

పన్నా : ఏమిటీ గొడవంతా? వనవీర్! ఎందుకింత ప్రబలంగావుంది నీ హింసాభావ మీానాడు?

వన : ఏం? జవాబుచెప్పవేం? విక్రమ్! నేను నీమార్గములో ప్రబల కంటకంగా ఉన్నాను. నీవొక హంతకుణ్ణి పంపావు. వాడు నన్ను చంపలేకపోయాడు.

విక్ర : నేను సీహత్యకోరి హంతకుణ్ణి పంపానా? ఎంత అద్భుతసత్యం! అందుకు సాక్ష్యం?

(రణజిత్ ప్రవేశిస్తాడు.)

రణ : నేనూ. విఫలప్రయత్నుడై ఆ హంతకుడు పారిపోతోంటే ఈకన్నులతో చూచాను.

విక్ర : హంతకుడు విఫలప్రయత్నుడయినందుకు సంతోషం. కాని వాణ్ణి నేను పంపానా? ఎవరు చెప్పారీ అబద్ధం?

రణ : అనుమానమూ, తర్కమూ చెబుతున్నై. లేకపోతే అన్నిసంగతులూ ప్రత్యక్షంగా ఎక్కడ చూడగలుగుతాం ఎవరమైనా?

విక్ర : రణజిత్! మొన్నటివరకూ నాకు వంతపాట పాడుతూండేవాడివి. నిన్నుకూడా ద్రోహచింతలే ఆవేశించినవే? కాక మీరిద్దరూ ముందుగా ఆలోచించుకువచ్చి ఈవిధంగా పరిహాసమాడుతున్నారా? చాలు, చాలు, ఈఅసహ్యపీడ చాలవరకు తెచ్చారు.

రణ : చావు, బ్రతుకుల సమస్య ముందుంచుకుని ఎవరు పరిహాసమాడుతారు.

వన : నీవు కొట్టిన దెబ్బ తప్పిపోయినతరువాత నేను డాలు వెతుక్కోవలయునా, కత్తిపట్టవలయునా? ఏం విక్రమ్! నీవు ఏం జవాబు చెప్తావు ?

ఉద : అమ్మా! వీడు ఏం చెయ్యాలనుకుంటున్నాడు?
చిత్తోడు సార్వభౌముని ఏమిటీ ఇట్లా సంబోధిస్తాడూ?

విక్ర : నాకేమీ బోధపడటంలేదు వనవీర్! ఈకుట్రకు కారణం ఎవరు? నాపక్షంనుండి నిన్నీరీతిగా విముఖుణ్ణిచేసినవారెవరు? నీపై హత్యాప్రయత్నము చేయబడినదని చెప్పబడేదానిని ఆధారం చేసుకొని బదులుగా నన్ను వధించాలని నీవు కోరేటట్లయితే నేను బ్రతుకుమీాద ఆశను వదిలేస్తాను. వనవీర్! సత్యమేనాటికైనా భూమిని బ్రద్దలుచేసుకొనియైనా బయటపడగలదు. సరే;

నీవు చిత్తోడు రాజ్యమకుటాన్ని కాంక్షించినట్లయితే దాని కింత బాధెందుకు? ఇదిగో ఆరాజమకుట మిచ్చటనే యున్నది-తీసుకో. (రాజమకుట మొసగును.)

వన : (రాజమకుట మందుకొని) తే; ఇటు తే; ఇకముందు దీనినిరక్షించే బాధ్యత నాది. సైనికులారా! విక్రముని బంధించండి.

(నలుగురు సైనికులు ప్రవేశింతురు.)

పన్నా : (ఒరనుండి కత్తిదూసి) ఇదేమిటి వనవీర్! జాగ్రత! నేను దాదినిమాత్రమే కాను; రసపుత్ర వీరనారీమణినని తెలుసుకో. నేను బ్రతికున్నంతవరకు మహారాణాను ఎవ్వరూ బందీ వేయలేరు.

(విక్రముని రక్షించును)

వన : సైనికులారా! చూస్తారేం! బంధించండి. నేటినుండి మహా రాణాను నేను.

పన్నా : (సైనికుల నుద్దేశించి) జాగ్రత! కాలు ముందుకు కదిపితిరా ముక్కముక్కలుగా ఖండిస్తాను.

(నలువురు సర్దారులతో కర్మచందు ప్రవేశించును.)

కర్మ : (పన్నా చేతినుండి కత్తిలాగుకొనగా-పన్నా గౌరవ పురస్సర ముగా ప్రక్కకు తొలగును.) పన్నా! శాంతించు. ప్రజలకోరికయు, పరమేశ్వరుని ఆదేశమును ఈవిధముగనే యున్నదమ్మా! నీవు స్వార్థచింత మరచిపో. సైనికులారా! బంధించండి.

విక్ర : సరే; బంధించండి. (విక్రముడు బందీ ఔతాడు.)

కర్మ : ఉదయ్! ఇటు రా నాయనా!

వన : ఉదయ్! ఈ రాజమకుటము నీది. తీసుకో. నీవు పెద్దవాడవగు వరకు దీని రక్షణబాధ్యత నేను వహిస్తాను. (ఉదయుని చేతులలో రాజమకుటము నుంచును.)

ఉద : (రాజమకుటమును నేలపై ఉంచి) కాదు; కాదు; ఇది చాలా బరువుగా ఉన్నది. దీనిని నేను భరించలేను.

(శీతలసేని ప్రవేశించును.)

శీతల: ఎవరు? మహారాణా విక్రమ సింహుడా! ఓహో! ఇది స్త్రీని అవమానించిన ఫలితముగాబోలు.

(స్థిర దృశ్యము.)

[తెర పడును.]

## నాల్గవ దృశ్యము

(వనవీరుని భవనము — వనవీరుడు రాజ మకుటము పుచ్చుకొని ప్రవేశిస్తాడు.)

వన : అహో రత్నఖచిత సువర్ణ రాజమకుటమా! ఎంత ప్రబలమైనది నీ ఆకర్షణ! నిన్ను స్పృశించినంతమాత్రాన నాలో ఎటువంటి పరివర్తన కలుగుతున్నదో చెప్పలేకపోతున్నాను. నీవు నాకు ప్రబోధించావు. ప్రపంచములో మైత్రి అనేదీ, మిత్రుడనే వాడూ పూజ్యమని; ఇంకా ఏమి ప్రబోధిస్తావో! అంతా ఆచరించటానికి సిద్ధంగా ఉన్నాను. (మకుటము తలమీద పెట్టుకుంటాడు) ఇప్పుడు రాజధానిలో ప్రతి మనుష్యుడూ నా నిశ్చయాలకు తల వూపుతాడు; నా ఆజ్ఞకు వేచివుంటాడు; నేను చాలా ఉన్నత పదవికి ఎక్కి వచ్చాను.

( శీతలసేని ప్రవేశిస్తుంది )

శీతల : ఇంకా మూడు మెట్లుపైన ఎక్కవలసినవి.

వన : ఏమిటమ్మా అవి ?

శీతల : సమయం వచ్చినప్పుడు నీవే తెలుసుకోనగలవు. నీ మిత్రుల సంఖ్య తక్కువగా వుంది. వనవీర్ ! నీ శత్రువుల సంఖ్యను తగ్గించేందుకు ఏమీ ఆలోచించలేదూ నీవు ?

వన : సర్దార్ ప్రోత్సాహంచేత బంధింపబడి – అతన్ని – ఇప్పుడు నీ ప్రోత్సాహంచేత... అదేనా నీవు చెప్పేది ?

శీతల : ఔనౌను, అతన్ని వధించు. పరమేశ్వరుడు వినా నిన్ను విచారణ చేయగలవాడు మరెవరూ లేరు. ఆయనకు జవాబు నాకు జరిగిన అవమానమే చెబుతుంది. ఆ అగ్నిలో అనుక్షణమూ దగ్ధమౌతున్నాను వనవీర్! నీ కా బాధ అర్థంకాదు.

వన : విక్రముని హత్య! అమ్మా! అది నీవు నా కెన్నాళ్ళనుంచో ఉద్బోధించుతున్నావు. మే మిద్దరమూ ఒక్కచోట పెరిగాం. అతనికికూడా నీవు ఉగ్గుపెట్టినదానవే కదమ్మా! అతడు నా పెదతండ్రి కొడుకు కాదూ? అతని హత్య కావాలదు.

శీతల : అయితే ప్రాణాలమీద ఆశ వదులుకో.

వన : నా కేభయమూ లేదు. సర్దార్లు విక్రముని బంధించారు. ఇదిగో రాజమకుటము! నావద్ద తాకట్టు వుంది. ఎవరమ్మా నాకు శత్రువులు?

శీతల : ఇంకొకసారి నాచేతనే చెప్పించాలనా?

వన : (కొంచెము జ్ఞాపకం తెచ్చుకుని) నీవు నా కొకప్పుడు జన్మ ప్రసాదించావు. మరొకసారి విక్రముడు పంపిన హంతకుని బారి నుండి రక్షించావు. అదీ జ్ఞాపకం వచ్చింది.

శీతల : అతడే తిరిగి-ఎప్పుడో మనకు తెలియదు గాని, ఏ సమయాననో నిన్ను వధించే ప్రయత్నం చేస్తాడు, తప్పక. ఈ విచారమే నన్ను ఆపాదమస్తకమూ రక్కిపెడుతున్నది. కౌరవులు పాండవులకు సోదరులు కాదేమిటి? న్యాయానికీ, బాంధవ్యానికీ సంబంధం లేదు. విక్రముని వధించు... వధించి, రక్త మారకుండా ఆ కటారుతోనే ఉదయుని...

వన : (అర్థోక్తిలో) ఊరుకో, ఊరుకో... అమ్మా! ఇదా ఉపదేశం! తల్లిలేని బాలుడు ఉదయుణ్ణి కొన్నాళ్ళవరకూ గుండెల్లో పెట్టుకొని పోషించావు నీవు రాజనీతి వస్త్రాచ్ఛాదనములో విక్రముని దండించుతావు కాని, అబోధబాలకుడు ఉదయుని అపరాధమేమున్నది?

శీతల : అదీ ఇప్పుడే ఆలోచిస్తాం. నీవు వినలేదూ? విక్రముడు సర్దార్లతో గుప్తసంధి చేసుకోబోతున్నాడు.

వన : (చకితుడై) గుప్తసంధి !

శీతల : ఔను. ఆ విషయమంతా తెలుసుకురమ్మని రణజిత్తును పంపాను. మరి విక్రముడు కారాగారవిముక్తు డౌతాడనుకో; ఎలాగ?

వన : విక్రముని విడిపించటానికి సర్దారు లెవరు? మహారాణాను నేను. కటారు ఇచ్చివెయ్యమ్మా !

శీతల : ఇదిగో [కటారు ఇవ్వబోతుంది]

వన : కొంచెమాగు; చూచివస్తాను బైట అంధకార మెంతవున్నదో; అందులో నేను దాగిపోగలనో లేదో.

[వనవీర్ నిష్క్రమిస్తాడు. రెండవవైపునుంచి రణజిత్తు గాభరాగా ప్రవేశిస్తాడు]

శీతల : ఎందుకా గాబరా? ఏమిటి సమాచారం?

రణ : సర్దారు కర్మచందు చెబుతున్నాడుకదా, విక్రముడు గనక న్యాయపూర్వకంగా రాజ్యంచేస్తానని ప్రతిజ్ఞ చేసేటట్లయితే, అతన్ని జైల్లోనుంచి విడిపించి, సింహాసనంమీద కూచోబెడతాడట మళ్ళీను.

శీతల : అయితే వెళ్ళు, వెళ్ళు రణజిత్ ! నీ విప్పుడేపోయి విక్రముని విడుదలకాకుండా యథాశక్తిని అడ్డుపుల్లలు వెయ్యి; తెలిసిందా? కర్మచందు కెట్టి అధికారమూ లేదు. మేవాడ్ మహారాణా మన వనవీర్.

రణ : మరి మేవాడ్ ప్రధానమంత్రి?

శీతల : నీవే ఔదువుగాని. కాని వనవీరునిమార్గం కంటకపూర్ణమై ఉన్నంతవరకూ కాలేవు. కాబట్టి విక్రముని విడుదల కానీయకు. వెళ్ళు; ఆలస్యంచేయకు.

రణ : అలాగే. [రణజిత్ నిష్క్రమిస్తాడు]

[తెరవైపుచూస్తూ మెల్లిమెల్లిగా వనవీరుడు ప్రవేశిస్తాడు.]

వన : అంధకారం. అంతటా అంధకారమే. కర్మసాక్షి అపరాబ్ధిలో క్రుంగిపోయాడు. చంద్రుడు కృష్ణపక్షపుచాటున దాగాడు. మంచు బిందువులవంటి నక్షత్రాలన్నీ మేఘాల్లో కరగిపోయినై. గృహ దీపికలుకూడా ఆరిపోయేవేళ. ఇట్టి తమోమయశర్వరిని నీవు నా చేతిలో కటారుపెట్టి శత్రుగృహానికి దారిచూపుతున్నావా, అమ్మా?

శీతల : బందీకృతమైఉన్న సింహాన్ని బోనులోనే వధించిరా.

వన : ఇటువంటి భీషణవధ అనంతమైన అత్యాచారం. విరామము లేని హాహాకారం – వీటిమీదనే ఆధారంగా నిల్చిఉంది రాజ సింహాసనం. నేను దాన్ని అధిష్ఠించగోరుతున్నాను. అమ్మా! ఏది కటారు!

(కటారు తీసుకొని మోకరిల్లి)

ఆశీర్వదించు. ఇది ప్రపంచములో అన్నిటిసీమించిన పాపకార్యమే కావచ్చు. అయినా అందులోనే ఒకపుణ్యం వుంది, ఆపుణ్యం మాతృవాక్యపాలన.

శీతల : (ఆశీర్వదించి) శత్రువధ నిర్వర్తించి నిర్భయుడవౌతావు.

(చెరొకప్రక్కనుంచి నిష్క్రమిస్తారు)

[తెరమారుతుంది]

## ఏదవ దృశ్యము

(చీకటి జైలు-శృంఖలాబద్ధుడై విక్రముడు)

విక్ర : విక్రముణ్ణి ప్రహరీ! వింటున్నావా? నిన్నటివరకూ నీవు నా ముందు చేతులుకట్టుకుని నిల్చున్నావు. ఇప్పుడు కరవాలము పట్టుకుని నిల్చున్నావు. నేను దుర్వ్యసనాలకు క్రీతదాసుణ్ణి అయి పోయాను. అయితే ఎందుకీ సమస్త చిత్తోడురాజ్యానికీ ప్రభువు

నైనాను. ప్రహరీ వింటున్నావా? నీవు వెళ్ళి ఒకపాత్ర మద్యము నింపి పట్టుకురా. అందులో ఇంత కాలసర్ప విషంకూడా కలుపు. ఎందుకంటే అదే నా అంతిమపానీయం. నాజీవితమంతా యీ మద్యముతో పోరాటము సాగిస్తూవచ్చాను. ఈరాత్రి నాశత్రువు నన్నంతము చేయునుగాక. నేను నవ్వుతూ నవ్వుతూనే విషపానము చేస్తాను. ఏం, దానివల్ల వీరస్వర్గం ప్రాప్తించదు ?

రాజవంశమా! నీకు భోగలాలస తగదు, తగదు. నే నొక బిచ్చగత్తె కడుపున పుడతాను.

(భోజనసామగ్రిఉన్న పళ్ళెము ఒకటి, కొన్నిదుస్తులు తీసుకుని పన్నా ప్రవేశిస్తుంది.)

ఎవరు?

పన్నా : మహారాణా! నేనే, దాదిని-పన్నాను.

విక్ర : దేనికి? ఎందుకోసము వచ్చావు?

పన్నా : తిన్న ఉప్పును బదులుతీర్చుకోడానికి

విక్ర : ఏవిధంగా?

పన్నా : (పళ్ళెము నేలమీద ఉంచి) భోజనం చేయండి. ఈపళ్ళెము పుచ్చుకొని ఈకారాగారమునుంచి విముక్తి పొందండి. ఈఉంగరము ద్వారపాలకుడికి చూపించి, కోటవిడిచి వెళ్ళండి.

విక్ర : (ఉంగరము తీసుకునేందుకు చేయిచాపుతూ) మరి నీవు ?

పన్నా : నేనిక్కడే ఉంటాను. (విక్రముడు చేయి వెనక్కు తీసుకుంటాడు.)

విక్ర : దాదమ్మా! వనవీరుడు నిన్ను చంపివేస్తాడు.

పన్నా : ఆసంగతి నాకు బాగా తెలుసును మహారాణా! రాజపుత్ర స్త్రీ చావుకు వెరవదు.

విక్ర : అయితే ఉదయుడు, చందన్ - ఆపసివాళ్ళను ఎవరు పోషిస్తారు? ఈవిధముగా విముక్తుణ్ణయి, నేను మాత్రం ఎక్కడికిపోయేది?

పన్నా : ఉదయుణ్ణి, చందన్‌నూ తీసుకొని ఈమేవాడ్ విడిచి ఎక్కడికైనాసరే వెళ్ళిపోండి, నిరాపదులై యుండగలరు. సంగ్రామ

సింహుని నామమహత్మ్యమే సైనికులందర్నీ కూడదీస్తుంది. మీ రక్తనాళాల్లోనూ ఆ వీరకేసరి తేజమే ప్రజ్వలిస్తూంది. ఆ సంగతి మీ రిన్నాళ్ళూ మరచిపోయారు; అంతే. ఏనాడు మీ రది స్ఫురణకు తెచ్చుకుంటారో, ఆనాడు ఒక్కడు కాదు; శతసహస్ర వనవీరులుకూడా మిమ్మెవరూ ఏమీ చెయ్యలేరు. తీసుకోండి ఉంగరం. త్వరగా భోజనం చేసి విముక్తిపొందండి!

విక్ర : వద్దమ్మా! అలా కాదు; నే ననేక అపరాధాలు చేశాను. అందుకు శిక్ష అనుభవించవలసి ఉంటుందనే ఆలోచన నా కే క్షణానా తట్టలేదు. ఈ చీకటింటనే నన్ను బాధింపబడి ఉండనీ. ఇదే నాకు శాంతిమయంగా కనబడుతోంది, పన్నా! నే నిప్పుడు ఖైదీనే. అయితే ఏమి? నా రక్తనాళాల్లో వీరశిరోమణి సంగ్రామ సింహుని రక్తమే ప్రవహించుతోంది. నేను పురుషుణ్ణి; స్త్రీవేషము వేసి నన్ను జైలు విడిపింప చూస్తున్నావు. వద్దమ్మా! అట్టి వేషముతో నేను స్వర్గానికేనా పోనొల్లను

(చేత దీపము పట్టుకొని ఉదయుడూ, కర్మచందూ ప్రవేశిస్తారు)

ఉద : (దీపము ఒక ప్రక్కన ఉంచి) అన్నా, ఇదిగో పితృతుల్యులైన సర్దారు కర్మచందుగారి సమక్షములో ప్రతిజ్ఞ చేయండి. మీ రాయన ఉపదేశాన్ని మన్నించవలసిన సమయం వచ్చింది. వీరు మీకు బంధ మోచన మిప్పించడానికే వచ్చారు. మీ రికనుంచి సన్మార్గవర్తు లౌదురుగాక!

విక్ర: (కర్మచందువైపు తిరిగి) దురభిమానమత్తుడనై నేను మీ మీద ఆనాడు నిండుసభలో కత్తియెత్తాను. క్షమించండి. ఏకలింగస్వామి సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. ఇకనుంచి ప్రజలను బిడ్డలనువలె పరిపాలిస్తాను.

కర్మ : రవికులభూషణులైన మీ కా మాటలు ఉచితముగా ఉన్నై. తిరిగి మీరు మహారాణా అవుతారు.

పన్నా : విక్రమసింహ మహారాణాకు జయము!

కర్మ : ప్రహరీ! మహారాణాను బంధ విముక్తుణ్ణి చెయ్యి.

(ప్రహరీ మహారాణాను విముక్తునిచేయుటకు వస్తాడు-ఇంతలో రణజిత్తు ప్రవేశము.)

రణ : (ద్వారపాలకుని చేయిపట్టి వెనక్కులాగి నిలువబెడతాడు) మంత్రిమహోదయులు మీరు! సమస్త సర్దార్ల నిమంత్రణచేత ఖైదీచేయబడ్డ ఈయన్ను, కేవలం తమ ఒక్కరి ఇచ్ఛానుసారం-తమ ఒక్కరి ఆజ్ఞప్రకారం - ఇప్పుడు విముక్తుణ్ణి చేయడం ఉచితం కాదు. తమరు మాకందరికీ పూజ్యులే; మాఅందరికంటే ఎక్కువ రాజ్యానుభవం కలవారే. వనవీరుడు మహారాణా అయినాడు; ఇంత శీఘ్రంగా ఆయన వ్యాకయానికి ఆఘాతం తగలకూడదు. కలహము రాకుండునుగాక! చిత్తోడులో శాంతి నెలకొనునుగాక!

కర్మ : అట్లేకానీ; మహారాణా! చింతించకండి. ఇదే తమ ప్రాయశ్చిత్తానికి అంతిమరాత్రి. రేపటి ప్రభాతసమయానికే విడుదల పొందగలరు.

ఉద : అయితే, మహారాణాను ఇప్పుడే విడిచిపెట్టరూ ?

కర్మ : అధైర్యపడకు, నాయనా! నీ వింకా కుర్రవాడివి; ఈ విషయాలన్నీ తెలుసుకోలేవు. ఒక్క రాత్రిమాత్రమే; యుగాలు కాదుగదా !

పన్నా : మీరింతవరకు ఏమీ భుజించలేదు, కొంచెం ఎంగిలిపడండి.

విక్ర : వద్దమ్మా! నాకేమీ తినాలనిలేదు. అది అక్కడే వుంచివెళ్ళు; కోరిక పుట్టినప్పుడు తింటాను. మీరందరూ వెళ్ళండిక. చాలా ప్రొద్దుపోయింది.

కర్మ : పద, పన్నా !

పన్నా : పదండి.

ఉద : ఈ దీపం ఇక్కడే వుంచి వెళ్లుదాం.

(విక్రముడు తప్ప అంతా నిష్క్రమిస్తారు.)

విక్ర : (దీపాన్ని ఉద్దేశించి ! సూర్యబింబము లేని వేళల నీవే చీకటి త్రోవల్లో వెల్తురు చిమ్ముతావు; దీపమా! నీకు నమస్కారము. ఈ కారాగారాన్ని నా పూర్వులు నిర్మించారు. ఇందులో వా

రెన్నడూ దీపం వెలిగించలేదు; నేనూ వెలిగించలేను. నా కోసంగా ఇప్పుడీ దీపం ఎందుకు వెలగాలి ? బహుశః ఈ అంధకారంలోనే నా పాపాలు భస్మీపటలమౌతాయేమో ! [దీపం ఆర్పి] బహుశః ఈ చీకటిలోనే నా శోకమార్గం కనబడుతుందేమో ! నిశ్శబ్దంగా ఉంటాను.

(వనవీరుడు జాగ్రతగా కటారుపట్టుకొని నాల్గువైపులా చూచుకుంటూ ప్రవేశిస్తాడు.)

వన : [తనలో] ఈఅంధకారంలో పాపమంతా మూర్తీభవించిఉంది. అది రూపుమాసిపోవుగాక. దానిపూపిరి చప్పుడుకూడా వినిపిచడంలేదు.

విక్ర : ఎవరివో అడుగులచప్పుడు. ఈఅంధకారంలో స్పష్టంగా కనిపించడంలేదు, ఎవరు నువ్వు?

వన : అడగవద్దా ప్రశ్న.

విక్ర : గుర్తుపట్టాను నీ కంఠస్వరం. మిత్రుడు వనవీరుడని.

వన : నీవెప్పుడూ నామిత్రత్వం కోరుతున్నావు. నన్నుమించిన శత్రువు నీకు లేడు విక్రమ్! నీకు తెలియలేదేమో ఇవాళ నాకటారు నీ రక్తాన్ని కోరుతుంది.

విక్ర : అందుకు నే నేమీ భయపడను. నాచేతులూ, కాళ్ళూ బంధింపబడి వున్నై; అతిసులభముంగా నీవు నన్ను వధించగలవు. కాని కొంచెమాగు; నా అపరాధమేమిటో తెలుసుకోనీ.

వన : అది సరిగ్గా నాకూ తెలియదు. తెలిసిన కొంచెమూ ఇప్పుడు చెప్పటానికి సమయముకాదు.

విక్ర : ఇంకొక్కమాట.

వన : చెప్పు.

విక్ర : ఈకట్లువిప్పి నన్ను విడిచిపెట్టు, వనవీర్! రాజముకుటము నీవే వుంచుకో. నేను నీరాజ్యపు పొలిమేరదాటి వెళ్ళిపోతాను. సన్యాసినై తీర్థయాత్రలు చేసుకుంటాను.

వన : మాట్లాడకు, విక్రమ్! నే నేమీ వినను. నీమాటలవల్ల నాకు మోహ ముత్పన్నమౌతోంది.

విక్ర : వనవీర్ ! వనవీర్!

వన : ఊహుఁ. ముగిసింది.

(విక్రముని ఛాతిలో కత్తి గుచ్చుతాడు)

విక్ర : (భూపతితుడౌతూ) హా! భగవంతుడు ...

వన : ( విక్రముని గుండెపై చేయి వుంచి ) విక్రమ్! మహారాణా విక్రమ్ !

(వనవీరుడు విక్రముని నాసికముందు వ్రేళ్ళుంచి మృతుడైనట్లు నిశ్చయించుకొని ఛాతిలోనుంచి కటారు పెరికికొని జాగరూకుడై పారిపోతాడు )

[ తెర పడుతుంది ]

## ఆరవ దృశ్యము

(చీకటి త్రోవ, తుఫాను, మెరుపులు - ఒంటరిగా రణజిత్తు ప్రవేశిస్తాడు.)

రణ : తప్పకుండా రాజమంత్రి నౌతాను. కాని శీతలసేని మనస్సు మారిపోతే ఒకవేళ ...? అయితేమాత్రం భయమేమిటి ? (లోపల జేబులోనుంచి శీతలసేని వ్రాసియిచ్చిన పత్రాన్ని బయటికితీసి) ఇది ఆవిడ దస్తూరికాదూ ? ఆమె సృష్టించిన ఈ సమస్త కపట ప్రపంచాన్ని ప్రకటనచేసే శక్తి దీనికి లేదూ ? ఆహా ! ఏమి ఈ అక్షరాల నీలి నిగనిగ ! ఇందలి శబ్దాల మధుర అర్థ చ్ఛాయ వశే ఉంది. దీనిమీద ప్రధానమంత్రి ఆసనం సుస్థిరం కావాలి.

(తెర కావల శీతలసేనిని చూచి పత్రాన్ని జేబులో పెట్టుకుంటాడు.)

ఎవరు ? ఆవిడే ?

(మెరుపు మెరుస్తుంది - శీతలసేని ప్రవేశిస్తుంది.)

శీతల : నీ విక్కడే ఉన్నావా ?

రణ : ఇక్కణ్ణించి కదలిపొమ్మని రాజమాత సన్నెప్పు డాజ్ఞాపించారు?

శీతల : రణజిత్, ఇంత సేపయింది; ఇంకా వనవీరుడు రానే లేదుకద!

రణ : అలా జరుగదు. ఈ త్రోవనే మహారాణా వెళ్ళారు; చూచా నుగా! ఆయన శరీరంలోనించి నిప్పురవ్వలు బయటికి చిమ్ముతున్నై. అప్పటి ఆయన నడకచూస్తే తప్పకుండా శత్రువధ చేసే వస్తారని నాకు నమ్మకం కలిగింది.

(వనవీరుడు ప్రవేశిస్తాడు)

వన : ఎవరూ ...? అమ్మా! నీవు ఇక్కడ ...

శీతల : ఔను, నీకు సహాయంగా — ఏమిటి సమాచారం?

వన : నీ అవమానాగ్ని, నా కటారుదాహం - రెండూ ఒకేసారి చల్లారినై.

శీతల : విక్రముని హత్య?

వన : ఔను, ముగిసింది; ఇదిగో అతని రక్తంతో తడిసిఉన్న ఈ కటారు నీపాదాలకు కానుక.

(కటారు శీతలసేని పాదాలముందు ఉంచుతాడు)

శీతల : చిరంజీవ! వనవీర్! విక్రముడు మరణించాడుకదూ!

వన : ఆ. నే నతని గుండెల్లో కటారు గుచ్చిన తక్షణమే భూపతితుడైనాడు. ఉచ్ఛ్వాసములులేని అతని నాశికముందు పరిశీలన కోసం వేళ్ళుంచి పిల్చాను "విక్రమ్! మహారాణా విక్రమ్!" అని. నిన్ను "దాసీ" అన్నవాడు-నా ప్రాణాలమీద దాహం గొన్నవాడు - అతని అధరోష్ఠాలు శాశ్వతంగా మూసుకుపోయినై.

శీతల : నాయనా! నీవు మాతృరుణ విముక్తుడవైనావు కాని ఉదయుడు జీవించి ఉన్నంతవరకూ, విక్రముని రూపుమాపిన సంతృప్తి పొందలేవు. ఇతని రక్తంతో తడిసిన నీచేతుల్ని అతని రక్తంతో క్షాళనచేసుకో. ఆ తరువాత ఇంకొక్కటే రక్తపాతం అదికూడా ముగిస్తే, సింహాసనంమీద వనవీరుడు! చిత్తోడు రాజ్యంలో శాంతి!! శీఘ్రంగా కానీ; ఈరాత్రి ఎంతో సుఖరక

మైనది. రేపటి సూర్యబింబమూ, నీ సౌభాగ్యమూ — రెండూ ఒకేసారి ఉదయించునుగాక !

వన : చక్కగా చెప్పావు; వాడు పెద్దవాడై విక్రమునిహత్య మరచిపోడు; చేరువైంది. వాడి అంత్యమూ-చేరువైంది.

[శీతలసేని నేలమీది కటారుఎత్తి వనవీరుని కిస్తుంది; మళ్ళీ మెరుపు మెరుస్తుంది-ఉరుముతుంది]

శీతల : తీసుకొని వెళ్ళు, ఉదయుడు మహాలులోనే నిద్రపోతున్నాడు.

వన : ఔను, ఎరుగుదును. (వనవీరుడు నిష్క్రమిస్తాడు)

శీతల : వనవీరుడిలో ఒకరకమైన దుర్బలత్వం ఉంది; ఒకవేళ కుర్రవాడైన ఉదయుణ్ణి చూచి, గుండె కరిగి, కటారు విసరిపారేస్తే ?

రణ : ఆజ్ఞాపించు దేవీ! -ఓ ప్రధానమంత్రిత్వమా! నీకోసమని -రాజమాతా! చెప్పండి. భూకంపంలో చొరబడేదా ? ప్రళయంలో నాట్యంచేసేదా?

శీతల : వనవీరుడిని అనుసరించి అతడు ఉదయుని వధించలేకపోతే నీవే ఆపని నెరవేర్చాలి.

రణ : అలాగే.

శీతల : తెలుసునా? ఉదయుని అస్థిత్వము-నీమంత్రిపదవీప్రాప్తికికూడా అంత భయంకర-ఆటంకమే.

రణ : ఔను. ఎరుగుదును. నే నతన్ని చంపగలిగితే-అతగాడి రక్తబిందువులన్నీ మీారిచ్చిన లిఖితపత్రానికి లక్షముద్రలౌతవి (కత్తిదూసి రణజిత్ నిష్క్రమిస్తాడు.)

శీతల : వెళ్ళు. ఒకవేళ నీవైనా ఆకుర్రవాణ్ణి వధించలేకపోతే? నేనూ వస్తున్నాను; నే నతన్ని వధించగలను.

(ఒరనుండి కత్తిపెరికి శీతలసేనికూడా అటువైపే వెళ్ళుతుంది.)

(తెర మారుతుంది.)

## ఏడవ దృశ్యము

[ఉదయుని శయనాగారము. సెజ్జమీద ఉదయుడు నిద్రపోతుంటాడు. తలగడవైపు దీపం వుంది. కాళ్ళవైపు నేలమీద పన్నా కూర్చుంది. ఆమె తొడమీద తలవుంచి పడుకుని చందన్ నిద్రపోతుంటాడు. తడవ తడవకూ ఉదయుడు కించిత్తు వ్యాకులం ప్రకటిస్తూ ఉంటాడు. అది పన్నా విచారదృష్టితో పరికిస్తుంటుంది. తిరిగి చందన్ కేసి చూసి ఆతనిమీద దుప్పటి కప్పుతుంది.]

ఉద : (మేల్కొని) అమ్మా! దాదమ్మా! ఒకవేళ విక్రమసింహ మహారాణాను సర్దార్లు రేపటిఉదయానికల్లా విడుదలచేయరేమో- ఎల్లాగు?

పన్నా : ఏమిటి, నీవింతవరకూ నిద్రపోనేలేదా? విచార మేమీ పెట్టుకోకు మనస్సులో. తప్పకుండా రాణా రేపు విడుదల ఔతారు. రాత్రిళ్ళు ఇంతప్రొద్దుపోయేవరకూ మేల్కొనివుంటే జబ్బుచేయదు తండ్రీ!

ఉద : నీవూ మేల్కొనే ఉన్నావుగా! నువ్వు చారణులదగ్గర నేర్చుకున్న ఆపాటపాడితే, వింటూ నిద్రపట్టించుకుంటాను.

పన్నా : ఆపాటా! నీవు చాలాసార్లు విన్నావు. (పాడుతుంది)

సింధుకాఫీ - త్రితాళం

హే మేవాడధరిత్రీ! నీస్తుతి
గానముసేతురుగా సురనరతతి
ఆహా ప్రకృతి ఎంత అందముగనో
నిర్మించెను నానానగములనూ
వనోపవన నదీ ఝరంబులనూ
పై నీలి తారకాకాశమునూ
కుంభ-ఖుమాన - సమాన వీరులను
బప్పా - సాంగా - ముఖ నరవరులను
కన్నావమ్మా జగ మువ్పొంగెను
జయము సూర్యకుల జలధి చంద్రులకు

(ఉదయుడు గీతికవింటూ నిద్రిస్తాడు.)

అబలలుకూడా ఇట అసి తాలిచి
మహాభయదరణకేళిక సలిపిరి
అమరయశశ్చంద్రిక లార్జించిరి
ఆ వీర సతీమణుల కిదే నతి
ఇంటింటా ప్రాకెను నీ కీర్తి
నీ ప్రచండతరరణతాండవగతి
విని గడగడవడకిరి శాత్రవతతి
నీ చరితము కన్నది లోకోన్నతి.

పన్నా : (గీతిక ముగించి) నిద్రపోయాడు.

(హఠాత్తుగా తెరఅవల రోదనధ్వని.)

ఈ ఆక్రందనం మహలులో నేనే!

(ఒకబుట్టలో ఎంగిలాకులు, చీపురు పెట్టుకుని బారీ ప్రవేశిస్తాడు.)

బారీ : పన్నా! సర్వనాశనం. (బుట్ట దించుకుంటాడు)

పన్నా : (తొడమీది చందనునితల నేలకుదించి గాభరాతో లేచి) ఏమిటిబారీ! ఏమిజరిగింది?

బారీ : వనవీరుడు జైలులోవున్న విక్రమసింహ మహారాణాను చంపి వేశాడు.

పన్నా : హా! భగవంతుడా! (ఏడుస్తుంది)

బారీ : దుఃఖపడి లాభంలేదు. ఏడుపు కిది సమయంకాదు. అత డిప్పుడు ఉదయుని వధించటానికి ఇక్కడికికూడా వాస్తాడు.

పన్నా : ఉదయుని రక్షించే ఉపాయం ఏమిటంటావు?

బారీ : నామనస్సుకేమీ తోచటంలేదు.

పన్నా : ఆశ వదలుకోవలసిందే ?

బారీ : ఆ ఘాతకుడికి దయకలిగితేతప్ప.

పన్నా : ఆ పాషాణం కరగదు. ఏవిధంగానైనాసరే నీవు ఉదయుని కోటఆవలకు తీసుకుపో.

బారీ : ఉదయు డిక్కడ కనుపించకపోతే వనవీరుడు నిన్ను చంపే స్తాడు. నీవు లేక ఉదయుడు జీవించటం కష్టం. అతన్ని ఎవరు రక్షి స్తారు?

పన్నా : (భావపరివర్తన కనబరచి) అయితే ఉదయుని ఇక్కడే వుండనీ (ఉత్తేజితమై) నేనతనిమార్గం నిరోధిస్తాను. అతనిచేయి విదళించి కత్తి లాక్కుంటాను. ముక్కలుముక్క లయ్యేలాగున కత్తిని నేలకు పిసిరికొడతాను. సావిత్రి మృత్యుదేవత పంజానుండి తనభర్తను విడిపించుకుంది. ఒకమానవుని చేతిపట్టునుండి నా ప్రభుకుమారుని విడిపించుకోలేనూ ? తప్పకుండా విడిపిస్తాను. వన వీరుడి హృదయంలో దయవుంది అతనికి నేనంటే ఆదరభావమే.

బారీ : కాదమ్మా! కాదు. రాజమకుటం ధరించినతరువాత అతడు పూర్వపు వనవీరుడు కాడు.

పన్నా : భగవంతుడా! చిత్తోడురాజవంశ మీరీతిని నిర్మూలము కావలసిందేనా?... మేవాడ్ రక్షణదేవతలారా! మీరైనా ఒక ఉపాయం చెప్పండి. ఈదీనురాలు, అబల, బలియిచ్చుకొనియైనా స్వామిక్షేమమే కోరుతుంది. (కొన్నిక్షణాలు విచారమగ్నయై, నిస్తబ్ధయై సిల్చి, క్రమేణ స్వరము హెచ్చించి) మత్-శిశు-రక్త-పిపాసీ ! చిత్తోడేశ్వరీ ! ఈమార్గమా చూపెడుతున్నావు? అల్లే కాగాక!—బారీ ! ఆబుట్టలో నిద్రించుచున్న ఉదయుని ఉంచు తాను. నీవు జాగ్రత్తగా కోటవెలుపలికి తీసుకుపో. వేరిస్‌నది యొడ్డున స్మశానంలో నాకోసం కాచుకునిఉండు.

బారీ : అయితే మళ్ళీ మొదటికే వచ్చావన్నమాట. వనవీరుని కేమి జవాబు చెబుతావు ?

పన్నా : అతని కళ్ళల్లో దుమ్ముకొడతాను.

బారీ : ఎలాగ ?

పన్నా : ఉదయుని పక్కలో ఇంకొకణ్ణి పడుకోబెట్టి.

బారీ : ఎవర్ని పడుకోబెట్టి ?

పన్నా : చూడు, చూడు, బారీ నా గుండె వనవీరుని గుండెకంటె కఠోర కర్కశమైపోయింది.

బారీ : రాక్షసితల్లీ ! ఎవర్ని పడుకోబెట్టుతావు ?

పన్నా : చందన్‌ను ... నా బిడ్డను.

బారీ : దయా, ప్రేమా లేని మృత్యువు ఒడిలోనా ? స్వామి ఋణం ఈవిధంగా తీర్చుకుంటావా ? ప్రొద్దున్నే లేచి దణ్ణంపెట్టాలిసిన తల్లివమ్మా, దేవీ !

పన్నా : కాదు. నేను దయ్యాన్ని, రాక్షసిని, కసాయివాని కత్తికి నా శిశువు నొప్పజెప్పుతున్నాను – బారీ ! ఆలశ్యంచేయకు. ఉదయుని రక్షించాలి. అతన్ని తీసుకువెళ్లు.

(బుట్టలోనుంచి ఎంగిలాకులు తీసివేసి అందులో ఒక గుడ్డ పరుస్తుంది పన్నా. దానిలో ఉదయుని పడుకోబెట్టి చిచ్చికొడుతుంది; మీదను వలిపెము కప్పుతుంది. పైన మళ్ళీ ఎంగిలాకు ఉంచుతుంది.)

బారీ : సరే, తీసుకువెళ్లుతున్నాను.

పన్నా : మంచిది; తొందరగా – నా నిశ్చయం మారకముందే – వనవీరుడు రాకపూర్వమే.

బారీ : పరమేశ్వరుడు నిన్ను రక్షించుగాక !

(పన్నా సహాయంతో బుట్టయెత్తుకుని బారీ నిష్క్రమిస్తాడు)

పన్నా : (చందన్‌ను ఉద్దేశించి) అభాగ్య – పితృహీనబాలకుడు ! నిద్రపోతున్నాడు. బిడ్డా ! ఈ కఠోరభూమి – ఇదే నీకు చివరి సారి తల్లియొడి– నేను సర్పిణిని–నా బిడ్డను పదకొండు వత్సరాలు పెంచి తినేశాను. వెళ్లు నాయనా ! ప్రభువుకోసం ప్రాణాలర్పించే ధీరులకు లభించే స్వర్గవాటికలో నీది అగ్రస్థానమౌగాక ! పుత్ర హత్య గావించుకొనే పాపికి కలిగే రౌరవములో నాది అధోగతి యగుగాక ! (మెల్లగా చందన్‌ను లేవనెత్తి సెజ్జమీద పడుకో బెడుతుంది) ఈ సెజ్జమీద నీ వెన్నడూ నిద్రించలేదు, ఇవాళ మెలకువలేని గాఢ నిద్రపో. మేలుకొంటివా రహస్యం బయట

పడుతుందిసుమా ! (ముసుగు కప్పుతుంది. కాని ముఖముమీద ఆవరణ తొలగించి) అది నా భర్త తాయత్తు. అదే ఇక నిన్ను కూడ జ్ఞాపకంచేస్తూండగల చిహ్నం. తీసుకుంటాను. (తాయత్తును తీసుకుని ముఖంమీద ముసుకు కప్పుతుంది) అంతవరకు బిడ్డ మొగము చూచుకుంటూ వుంటాను. (ముద్దుపెట్టుకోవాలనుకుంటుంది) వద్దు, వద్దు మేలుకుంటాడేమో. ఇప్పుడు కాదు. ఎంత అందమైన ముఖము! దేవతలే అందుకు సాక్ష్యం. కొంచెం ఆగి ముద్దుపెట్టుకుంటాను. వద్దు, వద్దు. అవిగో అతని అడుగుల చప్పుడు. (చందర్ ముఖంమీద ముసుగేస్తుంది).

(రక్తసిక్తమైన కటారుతో వనవీరుడు ప్రవేశిస్తాడు)

వన: పన్నా!

పన్నా: ఎవరు? వనవీర్! చేతిలో కటారు! దానిపై విక్రముని రక్తం!

వన: ఔనౌను. చెప్పు, ఉదయు డెక్కడ?

పన్నా: (వనవీరుని పాదాలమీద వ్రాలి) మరచిపోకు, వనవీర్! నీవు ఉదయుడి సంరక్షకుడివి. పాప పుణ్య విచారణ చేసుకో.

వన: శత్రువధ క్షత్రియధర్మంకాదూ? మాతృవాక్యపాలన పుత్రుడికి పుణ్యవిధికాదూ?

పన్నా: (లేచి వనవీర్ నెదుర్కొని) మదోన్మత్తుడా! నీవు ధర్మభ్రష్టుడవైనావు. నిన్నడ్డగించి తీరుతాను.

వన: పన్నా! అటు నిల్చిఉండు. లేదా, నీవుకూడా బలియైపోతావు. (సెజ్జవైపుచూచి) అదిగో అక్కడే వున్నాడు. (సెజ్జవైపునడుస్తాడు– పన్నా అతని వెనుక్కులాగుతుంటుంది. వనవీరుడు మంచం సమీపించి బాలుణ్ణి వధించేందుకు కత్తియెత్తుతాడు)

పన్నా: ఆగు! అంధ ఘాతకుడా! ఇక్కడైనా చెవియొగ్గి నీ కటారు చేస్తూన్న ప్రబోధం గ్రహించు. అది అంత యెత్తునుంచి చెబుతోంది. 'భయపడు' (ఆకాశంకేసి వేలు చూపెడుతూ) అతనికి భయపడు, అని.

వన : అదికాదు కటారు చేస్తోన్న ప్రభోధం. 'ఉన్నతిపొందటానికి ఇదే మార్గము' అంటోంది. (ఉదయుడే అనే భ్రమతో చందన్‌ను వధిస్తాడు.)

పన్నా : హా ! హా ! రాక్షసుడా !

(వనవీరుడు నెమ్మది నెమ్మదిగా చందన్ వక్షంనుండి రక్తప్లుతమైన కటారును వెలికి లాగుతాడు. ఒకవైపునుంచి శీతలసేని, మరొక వైపునుంచి రణజిత్ ప్రవేశిస్తారు.)

వన : నీవూ ఇక్కడికే వచ్చేశావా? అమ్మా ! ఇదిగో తీసుకో. నీయాజ్ఞ చివరివరకూ నిర్వర్తించాను.

(శీతలసేనికి కటారు యిస్తాడు)

శీత : తే, తే, శత్రురక్తంతో నీకు రాజతిలకం దిద్దుతాను.

రణ : మహారాణా వనవీర్‌కూ జై...!

(మధ్యన వనవీరుడు; ఒకవైపున శీతలసేని నిల్చి కటారుమీద రక్తంతో అతనికి తిలకం దిద్దుతూంటుంది. రెండవవైపున కరవాలపుఛాయ ఇస్తుంటాడు రణజిత్. పన్నా మూర్ఛిల్లి పడివుంటుంది)

(తెర వ్రాలుతుంది)



# రాజ మకుటం

## ద్వితీయాంకము

### ఒకటవ దృశ్యము

[పేరిస్ నదియొడ్డున స్మశానభూమిలో రేవులో పడవ కెరటాల తాకిడికి ఊగుతుంటుంది. బారీ ప్రవేశించి బుట్ట దించుకుంటాడు. ఉదయుడు మేల్కొని, లేచి నిల్చుని, చకితుడై]

ఉద : బారీ ! నిజంచెప్పు. ఎందుకు నన్నీ భయంకర స్మశానభూమికి తీసుకువచ్చావు? బుట్టలో పెట్టుకుని మోసుకొచ్చావే ? అది మరీ సందేహాస్పదంగా ఉంది. నీ ఉద్దేశ్యం నిర్దుష్టమైనట్టు తోచటం లేదు.

బారీ : నాకేమీ తెలియదు బాబూ ! దాది పన్నా ఆజ్ఞాపించినట్టు చేశాను, అంతే.

ఉద : నీవేమీ అబద్ధం చెప్పటం లేదుకదా ? నీలో కుటిల వంచన ఏమీ లేదుకదా ? నా యీ వస్త్ర భూషణాలకోసం ఈ ఏకాంత ప్రదేశంలో నన్ను హత్య చేయవుకదా ?

బారీ : హంతకుని బారినుండి మిమ్మల్ని రక్షించి తెచ్చాను.

ఉద : (కంపితుడై) బారీ ! నీవేదో భయంకర ఘటనాన్ని సూచనగా తెలుపుతున్నావే ! విక్రమసింహ మహారాణా ఈ ఉదయం విముక్తు డౌతాడు, చూద్దా మనుకున్నాను; కాని నీవు చెబుతున్నది యేమిటి ?

బారీ : పన్నా మనల్ని ఈ స్మశానంలోనే కలసికొంటానని చెప్పింది. ఈపాటి కామె వస్తుండాలి. రాగానే నీకంతా తెలుస్తుంది.

ఉద : నీవు మంచివాడివేనని విశ్వాసం కలిగినప్పటికీ నా హృదయం ఊరికే కంపించుతోంది. పద, ఆ యిసుకతిన్నెమీద కూర్చుని దాదమ్మకోసం ఎదురుచూస్తూ ఉందాం.

( ఇద్దరూ నిష్క్రమిస్తారు )

(తల విరబోసుకుని మతి స్థిరంగా లేక కొడుకు శవం మోస్తూ, పాడుతూ పన్నా ప్రవేశిస్తుంది)

కాలింగడా — త్రితాళం

పన్నా : మేల్కొరా తండ్రీ ! రాత్రి గడచెన్;
జీవము లిచ్చి జీవింతువురా.
నే విషమే త్రాగి బ్రతికియుంటిన్
ప్రేమామరలహరీజల మింకెన్,
హృదయము వజ్ర, మొడిశూన్యమయ్యెన్.
సుతసంహారణీ ఢాకిని నైతిన్,
ఇది విషసంఘటనమురా జగతిన్.

(పాట ముగించి) మాట్లాడవేం తండ్రీ ! సూర్యోదయ మయింది, చూడు; ఇంకా నిద్రపోతున్నావా ? లే, లే, నా ఆజ్ఞానువర్తివి కదమ్మా నీవు! సోమరివి కాదే! (కొంచెం స్మృతివచ్చి) ఇదేమిటి ! ఇక్కడికి వచ్చాను ? (అటు నిటు పరికించి) ఇది స్మశానభూమి ! వీడి ఛాతీమీద రక్తంవుంది. వీణ్ణి వనవీరుడు చంపాడు. మేవాడ్ సింహాసనంతో మా వాడి కేమీ సంబంధంలేదే! మరి వీడి అపరాధ మేమిటీ ? వనవీరుడు కాదు, వీణ్ణి చంపింది, నేనే హంతకిని. (ఏడుస్తుంది.)

[ఒకసన్యాసి ప్రవేశిస్తాడు]

సన్యా : అంత దీనంగా విలపిస్తున్నావు ఎవరమ్మా నీవు ? వచ్చినవాడు పోక తప్పుతుందా ? ఈ నిశ్చల సత్యాన్ని నీవెరుగవూ ?

పన్నా : మహాత్మా ! ఎరుగుదును. కాని మరి ఈ కన్నీళ్ల ప్రయోజనమూ కొంత ఉండాలికదా ?

సన్యా : అవి యిప్పుడు దాచుకో. వాటిని సుఖసమయాల్లో ప్రసరింప గలిగితివా, దుఃఖమనేది నీకొక హాస్యరేఖగా వికసిస్తుంది.

పన్నా : సన్యాసీ ! నీహృదయం పట్టి మరుభూమి. మాతృప్రేమ నీ వెరుగవు. చూడు, ఈ సుందరవదనబింబ మింత శీఘ్రకాలములో వాడిపోతగిందేనా ?

సన్యా : మృత్యువు ముందు తర్కరము పరాజితమే ఔతుంది. ఫలాని వాడు ఎందుకు మరణించాడూ అంటే చెప్పలేం. చితి ఒకటి పేర్చు. నేనూ తోడ్పడతాను. ఆ శవముతోపాటు నీ మోహాన్ని కూడా తగులపెట్టుకుని వెళ్ళిపో.

పన్నా : వీణ్ణి తగులపెట్టనా ? ఉహుః; తగులబెట్టను. వన-పర్వతాల నుంచి వీడికోసం సంజీవని వెదకి తెస్తాను. పోయి నిర్జరుల నడుగు తాను ఈ పసివాడికోసం జీవనభిక్ష. (సన్యాసిని నఖ శిఖ పర్యంతమూ అవలోకించి) ఎంత పరిపూర్ణ తేజోమయరూపము నీది ! నీవు తప్పక ఒక సిద్ధుడవు మహాత్మా ! నా కొడుకును బ్రతికించవూ ! (చందన్ శవాన్ని సన్యాసి చరణాలముందు ఉంచుతుంది.)

సన్యా : పరమేశ్వరుని ఇచ్ఛను యే సిద్ధుడూ ప్రతిఘటించ లేడు. ప్రాణికోటికి మృత్యువు తప్పదు. ఉదయ మైనవాడు అవశ్యం అ స్తమించవలసిందే.

పన్నా : (ఉదయ శబ్దం వినగానే రాజకుమారుడు ఉదయుడు జ్ఞాపకం వచ్చి, భావపరివ ర్తన ప్రకటిస్తుంది) ఆఁ ! ఉదయ-అ స్తమయమూ ! కాదు, మహాత్మా ! కాజాలదు. తద్రక్షణకోసమే యీబలి యిచ్చుకున్నాను.

సన్యా : (ఏమీ అర్థంకాక) ఏమిటీ అంటున్నావు ?

పన్నా : ఏమీలేదు మహాత్మా ! మాట్లాడనులెండి. మీరే ఆజ్ఞ ఇవ్వండి. వీణ్ణి (చందన్‌ను చూపుతూ) విడిచిపెట్టి తత్పాలన చేస్తాను.

సన్యా : అయితే వెళ్ళు; ఆ సమీపములో అగ్నిగుండం ఒకటి వుంది.

అందులోనుంచి ఇంత నిప్పు పట్టుకురా. నే నిక్కడ చితి పేరు స్తుంటాను.

(పన్నా ఏడుస్తూ నిష్క్రమిస్తుంది. సన్యాసి చితి పేర్చి దానిమీద శవాన్ని ఉంచు తాడు. పన్నా నిప్పుపట్టుకుని ప్రవేశిస్తుంది. ఏడుపు ఆగిపోతుంది.)

పన్నా : పట్టుకొచ్చాను నిప్పు.

సన్యా : చితి అంటించు; నేను పోయి వస్తాను. నీకు శుభం ...

(మళ్ళీ ఏడుస్తూ పన్నా చితి అంటిస్తుంది. సన్యాసి నిష్క్రమిస్తాడు. చితి మండు తుంటుంది.)

పన్నా : వెళ్ళిపో బిడ్డా! వెళ్ళు. దేశ, కాల, పరిమిత విముక్తమైన-తల్లులకు కడుపుశోకమంటూ ఉండని... సనాతన లోకానికి. చందర్! కాదు, కాదు. ఉదయ్...!

( బారీ, ఉదయుడూ ప్రవేశిస్తారు. )

ఉద : అమ్మా, అమ్మా! నీకోసమే ఇంతసేపునుంచీ ఎదురు చూస్తున్నాం. బారీ చెబుతున్నాడు, మహారాణాను వనవీరుడు హత్యచేశాడని. నిజమేనా?

పన్నా : ఔను; నిజమే.

ఉద : చందర్ ఏడీ?

పన్నా : చందర్! (చితివైపు చూచి, మళ్ళీ ఉదయుని కేసి తిరిగి) చందర్! నీవే... (మళ్ళీ చితివైపు చూస్తుంది )

ఉద : ఆ యగ్నిజ్వాలల్లో అంత ధ్యానపూర్వకంగా ఎవర్ని చూస్తు న్నావు? నాకు బారీ అంతా చెప్పాడులే. పద; నే నా పాపిష్టి వనవీరుని తగినట్టు దండిస్తాను.

పన్నా : వద్దు, వద్దు. ఈనాడు మేవాడ్‌లో ప్రతి అణువూ నీకు శత్రు రూపమే. మనం దేవలరాజును దర్శించి ఆయనను శరణు వేడు కుందాం. నీ తండ్రిగా రాయనకు ఎన్నో ఉపకారాలు చేశారు. ఆయన ని న్నిప్పు డవశ్యం రక్షిస్తాడు. ఇదిగో ఈ తావెత్తు చందర్ మెడలోనుండి తీశాను. నీవు ధరించుకో. నీ నిజస్థితి మెవ

రికీ చెప్పవద్దు. ఎవరైనా అడిగితే నీపేరు చందన్ అనీ, నేను నీ తల్లిననీ చెప్పు.

( ఉదయుని కంఠాన తాయెత్తు కడుతు.ది. )

ఉద : అలాగేనమ్మా!

పన్నా : బారీ ! నువ్వు చేసిన సహాయానికి ఎంతో రుణపడియున్నాను. ఈ రహస్యం ప్రకటము కాకూడదు సుమా !

బారీ : కాదమ్మా; కాదు.

పన్నా : పద, ఉదయ్ ! కాదు, కాదు, చందన్ ! అదృష్టవశాత్తు ఇక్కడ పడవ సిద్ధంగానే ఉంది. ఇందులో యెక్కి ఆవలియొడ్డు చేరుకుందాం బారీ ! మన ఉదయుణ్ణి తగిన రక్షణలో ఒప్పజెప్పి శీఘ్రకాలంలోనే చిత్తోడుకు తిరిగివస్తాను. నీవుపోయి అక్కడ పన్నా ఉదయుని అంతిమ సంస్కారము నిర్వర్తించి చందన్‌ను తీసుకుని తన పుట్టింటికి వెళ్ళిందని చెప్పు.

బారీ : అలాగే. భగవంతుడు మిమ్మల్ని కాపాడుగాక !

(బారీ సహాయంతో ఉదయుడు, పన్నా పడవనెక్కుతారు. ఆవలియొడ్డు చేరుతారు రెండవవైపునుంచి బారీ నిష్క్రమిస్తాడు.)

[ తెరపడుతుంది ]

—.—

## రెండవ దృశ్యము

[వనవీరుని మందిరం. విజయగర్విత శీతలసేని పాడుతూ ప్రవేశిస్తుంది]

కమాచ్—త్రితాళం.

శీతల : మధుర నాట్యము సలుపుమా !
క్రోధ- మహానల- చపల- కీలికా !
రక్తవర్ణినీ ! వివిధభంగిమల
మధుర నాట్యము సలుపుమా !

ఉగ్రమూర్తివై మెరయుము రణమున
బ్రహ్మాండంబుల, అణువణువున;
ప్రళయరుద్రునకు నుల్లాసముగా,
నా పరాభవము తాండవింపగా!

సంగ్రామసింహుని వంశం నిర్మూలంచేశాడు. ఎవరు? వనవీర్.
వనవీరుడి కెవరు ఉపకరణం? నేను. న న్నెవ రీ విలయతాండవం చేయించింది? నా మనోరాజ్యవిహారి ఆకాంక్ష! నీకు తృప్తి కాలేదా? ఇంకా ఏమికావాలి? మేవాడ్ రాజ్యమకుటం ఇచ్చాను. ఢిల్లీసింహాసనంకూడ ఇస్తాను. (ఒకప్రక్కనుంచి నిష్క్రమిస్తుంది-మరొకప్రక్కనుంచి రణజిత్తు ప్రవేశిస్తాడు.)

రణ : పట్టాభిషేకోత్సవదినం చేరువౌతోన్నకొద్దీ శీతలసేని నాపట్ల విముఖత్వం చూపుతోంది. నాచేత పనిఅంతా చేయించుకుని తీరా ప్రధానమంత్రిపదవి యివ్వకపోతే? అయినా భయమెందుకు? ఆమె స్వదస్తూరితో వ్రాసియిచ్చిన పత్రం నాదగ్గర లేదూ? ఆమె రహస్యమంతా నాపిడికిలిలో ఉందికాదూ! (వస్తోన్న వనవీరుని చూచి) వనవీర్ మహారాణాకు జయము!

వన : వనవీర్ మహారాణాకు జయము! మొన్నమొన్నటివరకూ ఆ నీ పెదవులు విక్రమునికి జయశబ్దం పలికినై. ఇవాళ మేవాడ్ రాజ్యమంతా ఐక్యకంఠంతో పలుకుతోంది: 'వనవీర్ మహారాణాకు జై' యని. అందరిశీర్షములూ వినతములై నన్ను గౌరవిస్తున్నై. రణజిత్! నేనేకదూ మహారాణాను!

రణ : చిత్తం. తమదోవలో ముండ్లన్నీ ఏరిపారవేయబడ్డట్టే. ఇక శత్రుభయమేమీలేదూ. మేవాడ్ రాణా తమరే

వన : ప్రజ లేమనుకుంటున్నారేమిటి ఇందునుగురించ?

రణ : ఈసంవత్సరపు పంటమీాద పన్ను తప్పినందుకు ప్రజల్లో ఆనందం వెల్లివిరిసింది. అందరూ తమకు జయపెడుతున్నారు. ఆజయ

నాదాల్లో విక్రమ, ఉదయుల హత్యనుగూర్చి విచారపడేవాళ్ళ ఆక్రందనం ఎక్కడ లీనమైపోయిందో తెలియటమే లేదు.

వన : రణజిత్ ! విక్రముని ఎవరు చంపారని ప్రజ లనుకుంటున్నారు?

రణ : విక్రముని హత్య చాలగుప్తంగా దాగిపోయింది. అయినా, అసలు ప్రజలకు విక్రముడంటే మంచిఅభిప్రాయం ఉంటేకదా ఆయన్ను ఎవరు చంపారన్నప్రశ్నవచ్చేది? వాళ్ళు తమర్ని రాజుగాపొంది సంతుష్టులై ఉన్నారు.

వన : కాని, రణజిత్! అబోధబాలకుడు ఉదయుని హత్యమాత్రం దాగజాలదు కదా! పన్నాకు అంతా తెలుసు.

రణ : దాన్నికూడా గుప్తంగా అణచిపెట్టగలం.

వన : నాటిరాత్రినుంచీ ఆమె కనిపించటం లేదు. తనకుర్రవాణ్ణి తీసుకుని ఎక్కడికివెళ్ళిందో తెలియదు.

రణ : అదీ చక్కబడుతుందిలెండి మహారాణా! మీరు నిశ్చింతగా ఉండండి. ప్రజలంతా మీకు అనుకూలురే.

(రోషంగా కర్మచంద ప్రవేశిస్తాడు.)

కర్మ : ఇతడుచెప్పే ప్రతి అక్షరమూ అబద్ధం. రాజ కర్మచారుల భయంవల్ల ప్రజలు వీధుల్లో, సందుల్లో కొత్త మహారాణాకు జయం పలుకుతూనే ఉన్నారు; నిజమే. కాని ప్రతిరాత్రీ, ప్రతి యింటా ఈ రాక్షసహత్యావిషయికచర్చ సాగుతూనేవుంది.

వన : 'రాక్షస-హత్య' అంటే తమ అర్థం విక్రమ - ఉదయుల వధ అనుకుంటాను. అయితే ఆ హత్య ఎవరుచేశారని ప్రజలు చెప్పుకోవటం ?

కర్మ : హత్యచేసినప్పుడు చూచినవాడెవడూ లేడు. కాబట్టి అనుమాన పడుతున్నారు. కాని అనుమానము సత్యానికి జన్మస్థానము కాదూ ?

వన : తమ యుద్దేశ మేమిటి ?

కర్మ : ఆ ప్రశ్న అడుగవద్దు వనవీర్! అడగవద్దు. నీవు మరి ఉదయుడి సంరక్షకుడివి.

రణ : చిత్తోడు మహారాణాముందు కాస్త ఆలోచించుకుని మరీ మాటాడండిసుమా !

కర్మ : నోరుముయ్ ! ఇచ్ఛకాలపోతు ! నీది వట్టి విషపూరితమైన వాక్కు. నీ శక్తిసీడలో ఈ రక్తపూరాన్ని దాచలేవు !

వన : ఏమిరక్తం ? ఎవరి హత్య ?

కర్మ : బంధింపబడిన, నిద్రపోతున్న ఇద్దరు సోదరుల హత్య. అది నీ మేధస్సులో ముద్రాంకితమై ఉంది. నీళ్ళు, నిప్పులతో అది సమసిపోదు. బంగారు, రత్నాల రాసుల్తో దాన్ని కప్పిపుచ్చలేవు.

వన : మీరు పొరబడుతున్నారు. పోనీ నేనే విక్రముని వధించాననుకోండి; అందుకు మీరుకాదూ సూచన యిచ్చింది ? ఆ హత్య నా తలవెంట్రుకల నలుపులో దాగిపోగలదు. కాని జాగ్రత్త ! తమ తెల్లగడ్డానికిమాత్రం రంగువేస్తుంది.

కర్మ : రాజ్యమదాంధుడవు ! అదా నీ ఆలోచన ? నేనా ని న్నీ హత్యకు పురిగొల్పింది ?

వన : విక్రముని బంధించి నన్ను సింహాసనంమీద నిలుపగోరినవారందరిలో మీరూ, మీ పుత్రుడూ అగ్రసరులు కామా ?

కర్మ : కాని నీ చేతుల్లో రక్షణభారం ఒప్పజెప్పాం. హత్యాచరణకోసం కటారు యివ్వలేదు.

వన : దాన్ని నేను-నా బుద్ధికితోచి-చేతపట్టాను. మీరు సింహాన్ని రెచ్చగొట్టి బంధించమన్నారు. నేనేమో దాన్ని వధించాను. ఇందులో నీతివిరుద్ధం ఏముంది? ఆగాయపడ్డ సింహం మొదట నామీదనే పడుతుంది; కొంతమంది దానికి సహాయంచేస్తారు. అప్పుడైనా నేను దానికోరలనుంచి రక్షించుకోవటానికి ఆయుధధారణ చేయువలసిందేకదా ! కనుకనే నాల్గురక్తబిందువులను మాత్రం రాల్చి, మేవాడలో రుధిరనదీప్రవాహాన్ని అరికట్టేశాను.

కర్మ: నీవు రుధిరనదీప్రవాహాన్ని అరికట్టేశావు. నిజమే. కాని వనవీర్! ఏనాడు ఆ ఆనకట్ట తెగిపోతుందో ఆనాడు ఆ ప్రవాహ వేగానికి నీవు, నీకోటూరు, నీసింహాసనం — ఏదీకూడా స్థిరంగా ఉండజాలదు. చండాలుడవు, విషపూరిత నిశ్వాసంతో బప్పారావలు వంశదీపాన్ని ఆర్పేశావు. ఆ శ్వాస నీకొనయూపిరే కాకపోయింది కదా!

రణ: ఈయన చేస్తున్న ప్రసంగం అసహ్యంగా ఉంది మహారాణా! ఆజ్ఞాపించండి. ఎల్లప్పుడు తమను గౌరవిస్తూ వంగియుండే యీతల మిమ్మల్ని రక్షించే నిమిత్తం మొండెమునుండి వేరుకావడానికి సిద్ధముగానే ఉంది. (కత్తిపిడిమీద చేయివేస్తాడు.)

వన: ఉద్రేకపడకు రణజిత్! అంత యవసరమేమీ లేదిప్పుడు. (కర్మచందువైపు తిరిగి) ఔనౌను. ఉదయుని హత్యతో విక్రముని హత్యను పూరించాను. రాజసింహాసనముకోసమై విక్రముని వధించాను. రాజసింహాసనం మీబలవంతంమీద స్వీకరించాను. ఇవాళ నీవేమో నన్ను దోషిగా పరిగణిస్తున్నావు. నేను మొదటే చెప్పలేదూ; నాకు రాజ్యమక్కర్లేదని! ఇక వెళ్ళు. నీకు చేతనైనదేమిటో చేసుకో, పో. అధికంగా నాకు బాధకలిగించావంటే మాత్రం—శిశుహత్యకు వెనుకాడని నాహస్తం ఒక ముదుసలి కోసం జాలిపడదని తెలుసుకో.

కర్మ: పాపీ! హంతకుడా! నీగర్వ మణగిపోవుగాక! నీవు నన్నా వధించగలవా? నేను నా దుర్బలస్వరంతో మేవాడ్ రాజ్యమంతా ప్రతిధ్వనించేలాగు చేస్తాను. 'ఒక ఘాతకుడు, రాక్షసుడు సింహాసనమధిష్టించాడు; అతడే ఉదయుని చంపివేశాడు' అని. (వేగముగా నిష్క్రమిస్తాడు.)

(రెండవవైపునుంచి శీతలసేని ప్రవేశిస్తుంది.)

శీతల: ఎందుకు పగిలిందీ ఈ అగ్నిపర్వతం? ఆ నోటికి బంగారపు కళ్లేలు తగిలించి, ఒక మాన్యపదవీవాగురలో అతన్ని బంధించాలి.

వన : నేనూ అదే ఆలోచిస్తున్నాను. బహుశః కర్మచందు తన కిక రాజసభలో ఆదరం జరుగదని సంశయపడుతున్నాడేమో ! నే నాయన్ను క్షమాపణ వేడుకుంటాను. మన ప్రధానమంత్రిపదవికి ఆయనకంటే యోగ్యుడు సమస్త మేవాడ్ రాజ్యంలో ఎక్కడా దొరుకడు.

రణ : రాజమాతా ! రాజమాతా ! ఇది నిజమేనా ?

(శీతలసేని ఒక కనుసన్నతో రణజిత్తును మాట్లాడకుండా చేస్తుంది )

శీతల : ఇప్పుడు కర్మచందును క్షమాపణ వేడుకోవలసినంత ఆవశ్యకత యేమీ లేదు.

రణ : ఔను, నిజం. అందుమూలాన ముసలివాడు మరీ నెత్తిమీద కెక్కి-కూచుంటాడు. మహారాణా ! మీకెందు కంతభయం ? మేవాడ్ ప్రభువులు మీరు; బొక్కసంమీది; అందులో బంగారమంతా తమది.

వన : ఔను, నిస్సందేహంగా నీసహాయం ఉండగా నా కెవరివల్లా భయంలేదు.

(ఆవేశంతో నిష్క్రమిస్తాడు.)

శీతల : ఈకర్మచందు ఒక్కడే నాకు అంతిమశత్రువు.

రణ : నాకుమాత్రం జడ్డిగంలో నే మిడతపోటులాగు తగులుకున్నాడు.

శీతల : ఆయనమూలానే వనవీరుని పట్టాభిషేకోత్సవం ఇంతవరకు ఆగిఉంది.

రణ : ఆయనమూలాన్నే నాకోసమైన ప్రధానమంత్రిపదవి ఇంత వరకూ శూన్యంగా ఉంది.

శీతల : ఒక్కపని చేయగలవా రణజిత్ ?

రణ : ఔనౌను; అర్థమయింది.

శీతల : మరి తక్షణం వెళ్ళు. ఇంకా ముసలివాడు ఇల్లు చేరుకుని ఉండడు.

రణ : దారిలోనే అతన్ని సమాప్తం చేస్తాను.(కటారు వెలికి తీస్తాడు.)

(చెరొకవైపునుంచి నిష్క్రమిస్తారు.)

[ తెర మూథుతుంది. ]

## మూడవ దృశ్యము.

[ఆరావళీ పర్వత ప్రాంత్యం. డూంగరపురపురాజు ఈశకర్ణుడు తన సేనాపతితో సహా వేటాడి తిరిగి వస్తూవుంటాడు.]

ఈశ : మృగయా క్రీడలో నీవు నాకంటే ఎక్కువగా అలసిపోయావు సేనాపతీ! అదిగో ఆచెట్టు నీడలో కాస్సేపు విశ్రమిద్దాం, ఈ ఆరావళీ పర్వత ప్రాంత్య ప్రకృతి శోభను విలోకిస్తూ.

(ఇద్దరూ ఒక చెట్టునీడను కూచుంటారు)

సేనా : చిత్తోడునుంచి మహారాణా వనవీరుని పట్టాభిషేకోత్సవానికి ఆహ్వానం వచ్చినట్టుందే తమకు!

ఈశ : ఔను. అవశ్యం మనం వెళ్ళవలె. కాని మేవాడ్‌లో సంఘటన యొకటి విన్నావా? వృద్ధ సర్దారు కర్మచందునుకూడా హత్య చేశారట. నెత్తురు దోగుతూ ఆయన శవం రోడ్డు ప్రక్కన పడి ఉందట. హంతకుని పత్తా ఇంతవరకు తెలియలేదట!

సేనా : పాపం! ఆయన బ్రతికివున్నన్నినాళ్ళూ అందరికీ యిష్టుడుగానే సంచరించాడు. రాజులూ, బిక్షుకులూ అందరూ ఆయన్ని సమానంగా గౌరవించారు. అంతటి న్యాయనిష్ఠుడైన ఆవీర సర్దారుని మరణం రాజపుత్రస్థానమంతకూ దుఃఖహేతువే.

ఈశ : రాజవంశ మంతరించటము చూచి ఆత్మహత్య చేసుకొన్నాడని కొందరనుకుంటున్నారు. మరికొందరు మహారాణా వనవీరుడే ఆయన్ను చంపించాడని చెవులు కొరుక్కుంటున్నారు.

సేనా : ఎందుకని?

ఈశ : బహుశః కొత్తరాణా మనస్సు పాతసర్దారు మనస్సుతో కలియలేదేమో. అయినా ఈ ప్రసంగంతో మనకు వచ్చేదేమిటి, పోయేదేమిటి; ఈ డూంగరపుర ప్రభువు ఇదివరకు విక్రమసింహుని యనుచరుడు; ఇప్పుడు వనవీరుని కధీనుడైనాడు. కాని, మహారాణా వనవీరుడు మన కొక సిద్ధ యాశ చూపించాడుసుమా!

(దుఃఖ స్వరంతో పాడుతూ పన్నా, ఉదయుడు ప్రవేశిస్తారు)

సోహనీ—త్రితాళం

పన్నా, ఉద : తనువు లలసిపోయే, ఇడుములోర్చి కారడవుల నడచి;
ధూళి గొట్టుకొని పగళ్ళు నడచి.
చుక్కల లెక్కిడి రాత్రులు గడపీ,
ఆశలన్నియూ విడచి వచ్చితిమి నీవే శరణు మహారా !

(ఉదయుని యెడమకాలి బొటనవ్రేలికి ఎదురుదెబ్బ తగులుతుంది. పన్నా పాడుతూనే చీరకొంగునుంచి పేలిక చించి కట్టు కడుతుంది.)

ఇడి గుండములో పడి చిక్కితిమే,
నాథ ! ఒడ్డునకు నాప చేర్పవే !
ఎందరికో అభయం బిచ్చితివే !
దయ నెందరినో, దరి జేర్చితివే !

పన్నా : ఈ యడవుల్లో పడి తిరిగి తిరిగి రావటంచేత నీముఖం వాడు వారింది, బట్టలు దుమ్ము కొట్టుకొన్నవి, చినిగి పోయాయికూడా. బిడ్డా నిన్ను నా వీపుమీద ఎత్తుకుంటాను. డూంగరపురము చేరు వకు వచ్చేశాం.

ఉద : వద్దమ్మా ! నీవు నిన్నటినుంచీ ఏమీ తిననే లేదు; నడిచేవస్తాతే.

పన్నా : అగణిత దీనదుఃఖజనశరణ్యుడవు, భగవంతుడా ! ఇంత నిలువ నీడ లేకపోయిందా హిందూసూర్యుడు బప్పారావంతవాని వంశజునికి ?

ఉద : ఆ చెట్టునీడన కాస్సేపు విశ్రమించి పోదాం.

(ఈశకర్ణుడు, సేనాపతి కూర్చొనియున్న వైపుకు చూపుతాడు)

పన్నా : (అటుచూచి చకితయై) ఎవరది? వేషభూషలనుబట్టి ఎవరో రాజవంశీకులుగా కనుపిస్తున్నారు. ఈయన పరిచయం పొందుతాను. (ముందుకు నడుస్తుంది)

ఈశ : (సేనాపతితో సహా లేచి) ఈనిర్జనప్రదేశంలో ఎవరు నీవు ?

పన్నా : రక్షించండి. రక్షించండి. నేనొక బిక్షుకురాలను. శ్రీమంతుల పరిచయ ప్రాప్తిని ఆశిస్తున్నాను. (మోకరిల్లుతుంది)

సేనా : నీ విప్పుడు డూంగరపురాధీశ్వరుని సమక్షంలో ఉన్నావు.

పన్నా : మహాభాగ్యం. తమ సేవాసంపత్తినే కోరి వెళ్ళుతున్నాను. దారిలోనే దర్శన మిచ్చారు.

ఈశ : ఆ కుర్రవాడు నీ కొడుకా ?

పన్నా : ఔను; కొడుకే. కొడుకునుకూడా అతనికోసం బలియిచ్చుకో తగిన యోగ్యుడు. ఇతన్ని తమరు పోషించండి మహాప్రభూ ! ఏనాటికైనా ప్రత్యుపకారం చేస్తాడు.

ఈశ : ఒక బిచ్చకత్తె కొడుకు ప్రత్యుపకారం చేస్తాడు ! సేనాపతీ ! ఈవిడ పిచ్చిది కాదుకదా !

పన్నా : ఈ కుర్రవాని తండ్రి మీా కనేక సహాయాలు చేశారు. మీా మహలుకు తీసుకుపోయి ఇతని పోషణభారం వహించండి.

సేనా : ఇంకా వినండి ! ఇంత కూడుపెడితే చాలదట. రాజమహలులో నివాసము కావాలట !

ఈశ : ఎందుకు ?

పన్నా : ఎందుకా ? ఇతడు తమ ప్రభువైన సంగ్రామసింహుని పుత్రుడు.

ఉద : (పన్నా వేలు లాగి అడ్డగించుతాడు. ఆవలకు తీసుకొనిపోయి చెబుతాడు) లాభంలేదమ్మా ! ఈయన హృదయంలో దయ లేదు. మనం బయలు పడకూడదు. పద, సింహ గహ్వరంలోనే ఆశ్రయం వెదకికొందాం. బహుశః అదే మనల్ని రక్షిస్తుంది.

ఈశ : ఏమి చెప్పావు ? ఇతడు సంగ్రామసింహుని పుత్రుడా ? చాలా బాగుంది నిజమేకాని. ఇత న్నెవరో చంపారు కదూ ?

పన్నా : ఎవరో చంపారు కాని, నేను తిరిగి బ్రతికించాను.

ఈశ : అయితే నీవద్ద అమృతంకూడా ఉన్నదన్నమాట !

సేనా : బిచ్చగత్తె కొడుకును రాజకుమరుణ్ణిగా మార్చే విద్య కూడాను.

ఈశ : సేనాపతీ, ఇక పద; ఇంకా రాజధాని చాలాదూరం ఉన్నది. లేకపోతే మరికొంతసేపు ఈవిడ మాటలతో వినోద కాలక్షేపం చేయవచ్చు.

పన్నా : నేను నిరాశతో వెళ్ళిపోవలసిందేనా మహారాజా !

సేనా : వెళ్ళిపో పిచ్చిదానా ! మరొకప్పుడు రాజధానికి రా. (ఈశ కర్ణుడు, సేనాపతి నిష్క్రమిస్తారు)

ఉద : అమ్మా ! ఇప్పుడిక ఎక్కడికి పోదాం ? దేవళరాజును సందర్శించాం. ఆయన వనవీరుడికి భయపడిపోయాడు. ఈ దూంగరపుర రాజు నిన్నొక పిచ్చిదాన్నిగా భావించాడు. ఇప్పుడిక ఈ ఆరావళీపర్వత ప్రాంతపు ఏదో యొక లోయయందే మన యాశలన్నీ కేంద్రీభూతము లౌతున్నవి. అమ్మా ! మనం యెక్కడికీ పోవద్దిక. రాజమకుటంమీద ఆశ వదులుకో. దానిలో ఏమి విశేషం ఉంది ? మనం ఈ వనాల్లోనే నివసిస్తూ, కందమూలాలు తింటూ, జీవనసుఖం అన్వేషించుకుందాం.

పన్నా : వద్దు, వద్దు, బిడ్డా ! నీవు నా బహిఃప్రాణానివి. అలా మాట్లాడకు. ఇప్పటికే ఈ రాజపుత్రస్థానమంతా సంగరాణాకు ఋణగ్రస్తులై యున్నవారితో నిండివుంది. ఎవరి హృదయంలోనైనా కాస్తంత దయ పొడసూపకపోదు. కమల్‌మీర్ ప్రభువు ఆశాశాహు ధర్మబుద్ధికలవాడు. ఆయన యెప్పుడూ నీ తండ్రిగారి ననుసరించి యుండేవాడు. ఈనాడు తప్పక నా కాయన ఆశ్రయమిస్తాడు.

ఉద : కమల్‌మీర్ ఇంకా చాలాదూరం ఉంది. అమ్మా, ఇప్పుడు మనం వెళ్ళలేం. నాకు చాలాసేపటినుంచి దాహంగా వుంది

పన్నా : నిన్ను నే నెత్తుకుని నెమ్మదిగా తీసుకువెడతానులే. ఇక్కడే జాగ్రత్తగా కూర్చునియుండు; మంచినీళ్ళు వెదకి పట్టుకొస్తాను.

(పన్నా నిష్క్రమిస్తుంది. కొందరు తాంత్రికులు ప్రవేశిస్తారు.)

ఒకడు : పట్టుకోండి, పట్టుకోండి ... !

రెండవవాడు : అక్కడే; అక్కడే...

( ఉదయుని సమీపించి, ఇద్దరు తాంత్రికు లతని చేతులు పట్టుకుంటారు. )

ఉద : ఏమిచేస్తారు నన్ను పట్టుకొని ?

మొదటి : పద, అక్కడే తెలుస్తుందిలే !

ఉద : విడవండి, విడవండి... నా దగ్గర ఈ బంగారిపు తామెత్తు తప్ప మరేమీ లేదు.

రెండవ : మా కది అక్కర్లే లేదు. నీతోనే పనుంది.

ఉద : నాకు మరీ దాహంగా ఉంది. మా అమ్మ నీళ్ళు పట్టుకువస్తానని వెళ్ళింది. నన్ను మొదట దాహం తీర్చుకోనివ్వండి.

మొదటి : పద; మంచినీళ్లు అక్కడే తాగుదువుగానిలే. మా సర్దారుకు నీతో అవసరం వచ్చింది.

ఉద : ఎందుకు ?

రెండవ : నిన్ను కాళీమాతకు బలి యివ్వాలి. మా సర్దారుకు స్వప్నంలో అమ్మవారు చాలా ఆకలిగా ఉన్నట్టు కనిపించిందట.

ఉద : నా బలితో ఆమెను తృప్తిపడనీయండి. నేనూ అందుకోసమే ఎదురుచూస్తున్నాను. కాని మొదట మా అమ్మదగ్గర సెలవు తీసుకోనివ్వండి.

( తాంత్రికులు ఉదయుని పట్టుకుపోతారు. రెండవవైపునుంచి పన్నా ప్రవేశిస్తుంది దొన్నెలో నీరు పట్టుకొని. )

పన్నా: (ఉదయుడు కనుపించక అటూ ఇటూ పరికించి చకితఔతుంది) ఏడీ ! ఎక్కడున్నాడు? ఈచెట్టునీడనేగా కూచున్నాడు. ఔను నిస్సందేహంగా ఇక్కడే. మరి ఇంతలోనే ఏమైనాడు? దాక్కున్నాడా? నాతో ఎప్పుడూ పరిహాస మాడేవాడు కాదే ! (పిలుస్తుంది) ఉదయ్ ! ఉదయ్ !! ఉదయ్ !!! (ప్రత్యుత్తరంలేక ఆమె చాలా చింతపడుతుంది. నీటిదొన్నె చేతిలోనుంచి క్రింద జారిపడుతుంది) హా ! భగవంతుడా ! పిలిస్తే పలుకవు? ఎక్కడికెళ్ళావు? ఏ హింసా జంతువుకో ఆహారంకాలేదుకద! (నేలమీద పదచిహ్నాలు చూచి)

ఎవరివో మనుష్యుల పదచిహ్నాలు ఇక్కడ అంకితమైఉన్నవి. వాటి మధ్యన ఉదయుని సుకుమారమ్మైన— అచ్ఛాదనము లేని చిరు పాదాల ముద్రలుకూడ ఉన్నవి. అతని యెడమకాలికి ఎదురుదెబ్బ తగిలినప్పుడు గుడ్డకట్టు కట్టాను, అదికూడ అచ్చుపడ్డది. అతన్ని ఎవరో పట్టుకుపోయి వుంటారు. ఇటే వెళ్ళినట్టుంది, నేను ఈ పద చిహ్నాల ననుసరించే వెళ్ళుతాను. (పన్నా భూమిమీద పదచిహ్నా లను ఏకాగ్రదృష్టితో అనుసరిస్తూ నిష్క్రమిస్తుంది)

(తెర మారును.)

## నాల్గవ దృశ్యము

(వనవీరుని దర్బారు- ప్రధానమంత్రి ఆసనం శూన్యంగా ఉంటుంది-రణజిత్, ఛందావత్ మొదలైన సర్దార్లు వారి వారి ఆసనాలమీద సుశోభితులై ఉంటారు. ఒకవైపు రాజమకుటం పట్టుకొని శీతలసేని—మరొకవైపు పూజాసామగ్రితో రాజగురువు-ఇరుప్రక్కలా ద్వారపాలకులు)

వన : మేవాడ్ రాజ్య శుభచింతనులు—సమస్తసామంతరాజులు— సర్దార్లు— ఈ నా పట్టాభిషేకోత్సవానికి దయచేసి ఈసభను శోభాయమానం చేస్తున్నారు. తమ యాగమనమే మీరు నా అను యాయులన్న సంగతి ప్రకటన చేస్తున్నది. దేశంలో శాంతి, న్యాయం నెలకొల్పునిమిత్తం నేను మకుటధారణ చేస్తున్నాను. ఈకర్తవ్యము సఫలమయ్యేలాగు మీరు సాయం చేయుదురుగాక ! మేవాడ్ శాంతికోసమని నేను కత్తికూడ పట్టవలసివచ్చినది; నిజమే. కాని అనివార్యమది. నాకిప్పు డన్నివిధములా సంతృప్తి కరంగానే ఉంది; కాని, మన ప్రధానసర్దారు కర్మచంద్రు ఆసనం శూన్యంగా ఉండటముమాత్రం నన్ను ఖేదపెడుతున్నది.

ఛందా : కర్మచంద్రు కుమారుడు జయసింహుడు తండ్రిగారి పదవికి యోగ్యాధికారి. విద్యాబలములో, న్యాయనీతియందు, రణకౌశల మున తండ్రికి సమానుడు. ఈఆసనం అతనికే ఎందుకీయకూడదు?

వన : నా నిశ్చయమూ అదే. రాజ్యంలో ఈపరివర్తన శతడే మూల పురుషుడు. కాని ఈసమయాన అతని యుదాసీనత విస్మయజనకంగా ఉంది.

శీతల : ఈపట్టాభిషేకోత్సవానికి అతనికే అందరికన్నా ముందుగా ఆహ్వానం వెళ్ళింది. కాని అతడింతవరకూ రానేలేదు

రణ : జయసింహునికి మంత్రిపదవి ఇచ్చే విషయములో నా సంపూర్ణ అసమ్మతి తెలుపుతున్నాను. కారణం: అతడిప్పటికైనా వచ్చి వనవీర్ మహారాణాతో చేయి కలపకపోవుటయే. అతనికీ ఆసనం ఇవ్వకూడదు. అయినా అతడు స్వయంగా దాన్ని స్వీకరించడు కూడాను.

శీతల : అతడు స్వీకరించని పక్షములో మరొకయోగ్యునికే ఈయబడుతుంది.

రణ : (తనలో)ఆయోగ్యుడు శ్రీమాన్ రణజిత్తే.

ఛందా : హఠాత్తుగా సంభవించిన తండ్రిగారి మృతికి జయసింహుడు చాల వ్యాకులపడి ఉంటాడు.

వన : ఐనా వనవీరు డాయనను చంపలేదే !

(తెరలో ఘంటా—శంఖ నాదాలు—సుమధుర వాద్యధ్వనులు)

రాజ. పట్టాభిషేక సుమూహూర్తము సమీపించింది. తిలకధారణ చేయండి మహాప్రభూ !

వన : సిద్ధంగానే ఉన్నాను. (రాజగురువు వనవీరునికి తిలకందిద్దుతాడు. శీతలసేని మకుటం శిరస్సుపై ఉంచుతుంది )

శీతల : విద్యాధరులు పాటపాడండి! మేవాడ్ నూతనమహారాణాకు మంగళగానం చేయండి! (విద్యాధరులు ప్రవేశించి పాట ఆరంభించబోతున్నప్పుడు వేగంగా జయసింహుడు ప్రవేశిస్తాడు.)

జయ : జాగ్రత్త ! ఆగండి ! మొదట నన్నీ ఉత్సవాన్ని అమంగళపూర్ణము చేయనీయండి.

ఛందా : ఎవరు? సర్దారు జయసింహుడా !

జయ : ఔను, ఎవరి వృద్ధజనకుని విూకు పొసగించి వధించితిరో, ఆ అభాగ్యుడే జయసింహుడు.

శీతల : మేము వధించలేదు సర్దారుమహాశయా ! ఆయన పదవికి నిన్ను నియుక్తునిగా చేశాం.

వన : ఇదిగో నీ ఆసనం, నాకు మిక్కిలి చేరువనే ఉంది, ఇక్కడ నీ వాసీనుడవై మేవాడ్ ప్రజాక్షేమకరంగా నాకు మంత్రిత్వము నెరపుదువుగాక !

జయ : నోరు ముయ్ ! హంతకుడా ! నీవు నా మనస్సును నీ సింహాసనమిచ్చికూడా కొనలేవు సర్దారపరక్తజనులను మూడింటిని ప్రవహింపజేశావు. ఇప్పుడా రక్తాన్నే చిలికి నిమ్మా, నీ ఉత్సవాన్ని కళంకితం చేస్తాను.

రణ : జాగ్రత్త ! సర్దార్ ! పితృశోకంచేత నీ మెదడు సరిగ్గా పనిచేయటంలేదు. కాస్త శాంతించి మాట్లాడుమరి ! నీ నోటివెంట రాజసభలో ఉచ్చరించదగ్గ మాటేమీ రావటంలేదు, జాగ్రత్త !

జయ : నోరుమూసుకో రణజిత్ ! నిన్నుకూడా బాగా ఎరుగుదును.

వన : నీకు హెచ్చరిక చెబుతున్నాను; కొంచెం ప్రాణభీతి కలిగి సంచరించు.

జయ : ప్రాణభీతి ! నాకు లేదు. అణుమాత్రము లేదు. ఎందుకుండాలి! ఉదయుని ముఖం చూచైనా విక్రముని హత్య మరచిపోయేవాణ్ణి. పితృసేవాభాగ్యముకలిగి ఉదయునిహత్యకూడా మరచిపోయేవాణ్ణే. కాని నాకు జీవితాశ కలిగించేందుకు దేన్నీ నీవు మిగల్చలేదు. (కత్తిపెరికి) కత్తితో భయపెడతావా వనవీర్? నీవొక పెద్ద ఘాతుకుడవే అయినా నన్నెదుర్కోలేవు. బంధింపబడిన విక్రముణ్ణి కాదు; నిద్రించుతోన్న పసివాడను ఉదయుణ్ణి కాను; ఒంటరిగా వీధిలో నడిచి వెళ్ళుతోన్న వృద్ధసర్దారు కర్మచందును కాదు. తెలుసునా? ఈ నీ రాజ్యారోహణ తృష్ణకు ధిక్కారాన్ని నేను. నీ మేవాడ్ రాజ్యాన్నీ, ఈ కత్తినీ ఇప్పుడే విడిచిపెడుతున్నాను. (కత్తిని విసిరిపారేస్తాడు.) బ్రతికియున్నంతవరకూ ఈ నీ పాపకథను

ఆర్యావర్తములో ప్రతిమూలా వ్యాపింపచేస్తాను. బప్పారావలు పవిత్రవంశనాశకుడా! నశిస్తావు. [వేగంగా నిష్క్రమిస్తాడు.]

రణ : అనుమానమెందుకు? ఇతనికి పిచ్చెత్తిపోయింది మనం మాట్లాడకుండా ఉండటమే మంచిదయింది. పోనీ, పీడ వదలింది.

శీతల : వాగితే వాగాడు. వీడి వాగుడుతో ఏమౌతుంది. విద్యాధరులు ఇట్లా నిలబడిపోయారేం! మీరు సుమధురగానం చేసి రాజసభను హర్షప్రతిధ్వానులతో నింపండి.

(విద్యాధరులు గానంచేస్తారు)

పహాడీకమాచ్ —

పాడండి మన కొత్త ప్రభువునకు మంగళం,
వెలివిరిసినవి సౌఖ్యచంద్రికలు నేడు సుదినం,
ఎంతవరకిల శశి తారకలీ దివి భాసిల్లునో,
సుమనో మనము అమలభావోన్నతి విలసిల్లునో,
అంతవరకిల శత్రుంజయుడవై పాలింపుమా!
సుఖశాంతి శ్రీ సంతోషితుడవై విహరింపుమా!

కీర్తి వెలయింపుమా!
భవనమున,
భువనమున,
గగనమున,

ఇది సుఖసౌభాగ్యోదయ సమయం,
పాడండి మనకొత్త ప్రభువునకు మంగళం!



## ఐదవ దృశ్యము.

[గుహలో కాళికావిగ్రహంముందు దక్షిణహస్త శూన్యుడైన తాంత్రికుల గురువు బహదుర్ సింహుడు కాళీమూర్తికి ఆరతి ఇస్తుంటాడు. ఉదయుడు యూపస్తంభానికి కట్టబడి వుంటాడు. అతనిముందు వధికుడు కత్తి ఎత్తి సర్దారు ఆజ్ఞకోసం ప్రతీక్షిస్తుంటాడు. ఇంకా అనేక తాంత్రికులు అక్కడక్కడ నిల్చి ఉంటారు. అందరూ పాడుతుంటారు.]

కేదారగౌళ - త్రితాళం.

అందరు : జయ, జయ, కాళీ! స్మశానవాసినీ!
పాపవినాశిని! పుణ్యప్రకాశిని!
రిపుమస్తక విచ్ఛేదకారిణి,
చరణభక్తజన నిత్యపాలినీ
మృత్యుభయద వికటాట్టహాసినీ
మహాకాల దృఢపక్ష విహారిణి!

ఉద : వ్యాకులపడె నీ సంతానము దుఃఖపీడితమై,
దయావతీ! జననీ! లేదా ఒకచూపిట మాపై.

అందరు : నీ మహిమ సర్వలోక ప్రసిద్ధమె
నిఖిలసంపదలు నీ చేటికలే
చురకత్తిని చేదాలిచి తల్లీ!
సిద్ధముకమ్మా జగసంహారిణి!

ఉద : (నిశ్వసించి) మీరందరూ కలసి నన్ను చంపేస్తారా? అంత ఘోరఅపరాధినా?

బహ : నిస్సందేహంగా నీరక్తంతో మా కాళీమాత ఆకలి తీరుతుంది. దేశంలో అనావృష్టి తప్పిపోతుంది. చాలారోజులనుంచీ తల్లి ఆకలితో ఉంది.

ఉద : కాదు, కాదు. నారక్తాన్ని ఒక్కబొట్టుకూడా ఈ పాషాణమయమాత ఆస్వాదించదు. మీరు ప్రవహింపచేసే రక్తధారలన్నీ ఈకఠిన భూతలాన మీ పాపకథంతా ముద్రించి మరి ఆరిపోతై. విడిచిపెట్టండి, రాక్షసులారా! విడిచిపెట్టండి!

బహా : మేము రాక్షసులం కాము. నిన్ను బలియివ్వడంలో మాకు స్వార్థచింత యేమీ లేదు. వీరకుమారుడిలాగు కనిపిస్తున్నావు. మృత్యుభయం వదలుకో. నీకు స్వర్గవిలాసం లభించబోతోంది. నీ ఒక్కడి చావుతో అనేకులకు క్షేమం కలుగుతుంది. వధికుడు సిద్ధంగా ఉన్నాడుకదూ!

వధి : చిత్తం మహాప్రభూ!

ఉద : ఆగు ! ఒక్కక్షణం ఆగు!

బహా : చెప్పు; జీవితాశ మిళితంకాని యేకోరికైనా నెరవేర్చబడుతుంది.

ఉద : నేను మిమ్ములను జీవనభిక్ష అడగను. ఈ కట్లు విప్పండి మొదట.

బహా : (కట్లు విప్పి) చెప్పు, ఏమిటి నీ కోరిక?

ఉద : (మెడలోనుంచి తాయెత్తు తీసి) అభాగిని, నా తల్లి నాకోసం వెదకుతూ నీకెక్కడైనా కనిపిస్తే ఈ ఆమె తాయెత్తు ఆమెకిచ్చి చెప్పు; 'నీకుమారుడు సుఖంగానే మరణించాడు' అని. (బహదూర్ సింగుకు తాయెత్తు ఇస్తాడు.)

బహా : (తాయెత్తును గుర్తించి చకితుడై తనలో) అరె, ఈ తాయెత్తు నాదే నే! ఇత డెవరు! నా కొడుకు చందన్ కాదుగదా! ఇతని తల్లి భర్తృపరిత్యక్త పన్నా కాదుగదా!

వధి : మహారాజా ! ఆజ్ఞాపించరూ?

బహా : నీ పేరేమిటి నాయనా?

ఉద : చందన్.

బహా : (వధికుడితో) కత్తి అవతల పారేసి ఇతని కట్లు పూర్తిగా విప్పు.

వధి : అదేమిటి మహాప్రభూ! కాళీమాతకు కోపంరాదూ !

బహా : (ఆసమయాన ఉదయుని కాలి బొటనవ్రేలికి కట్టిన కట్టు చూచి) కోపంరానీ, ఫరవాలేదు. సంతానాన్ని రక్షించుకోవాలి

అటు చూడు, ఇతనిబొటన వ్రేలుకోసుకుపోయింది; కాబట్టి యితని బలి మాతకు స్వీకారార్హము కాదు– విడిచిపెట్టం డితన్ని.

(వధకుడు, బహదూర్ సింగు అతని కట్లు విప్పేస్తారు. పన్నా పాదచిహ్నా లనుసరిస్తూ అక్కడికి ప్రవేశిస్తుంది)

పన్నా : చందన్! చందన్! ఎవరు నిన్నిక్కడికి తెచ్చారు? జాగ్రత! రాక్షసులారా! అతనిమీద ఈగ వాలినా అది మీకు శ్రేయం కాదు.

బహా : కాదు, నిజమే. అదే పరమేశ్వరుడి యిచ్ఛకూడాను. మేమితన్ని బలినిమిత్తమే తెచ్చాం; కాని ఇప్పుడు మాత చెబుతోంది: ఈకుర్రవాణ్ణి రక్షించమని. నేనూ, నా యీ అనుచరులూ (అనుచరులను చూపిస్తాడు; వారు చేతులు జోడించి అవనతులై ఉంటారు) సర్వమూ త్యజించి, నీకు సహాయం చేయటానికి సిద్ధమై ఉన్నాం. నీవీ కుర్రవాడికోసం వెదుకుతూ వచ్చినట్టు తెలుస్తూనే ఉంది. చెప్పు నీ కోరికేమిటో.

పన్నా : నిజమేనా? (తనలో) సంరక్షకుడుగా ఉండవలసిన వాడే భక్షించాడు. (ప్రకాశంగా) భక్షకుడివి నీవు రక్షించగలవా?

బహా : తప్పకుండా; మనుష్యులను కేవలం హింసాత్మకులనుగానే భావిస్తున్నావు కాదు, కాదు, దయాపరులంకూడా. మాకూ ధర్మమనేది ఉంది.

(తనలో) ఈమే, ఔను, పన్నా. విషాదచ్ఛాయ లావరించి, గుర్తించేందుకు వీల్లేకుండా ఉంది. నన్ను గుర్తించలేక పోతున్నది. నేను ఆ ప్రసంగ మెత్తను. (ప్రకాశంగా) నిశ్శబ్దంగా ఉన్నావేం?

పన్నా : ఏమీలేదు; నే నిప్పుడు కమల్ మీర్ వెళ్ళాలి. నా కుర్రవాడు చాలా అలసిపోయాడు.

బహా : నీ కుర్రవాణ్ణి నాభుజంమీద కూచోబెట్టుకుని తీసుకు వస్తాను.

(ఉదయుని భుజంమీది కెత్తుకుంటాడు)

పన్నా: నీదయ! (బహాదుర్ సింహునకు దక్షిణహస్తం లేకపోవటం చూచి) ఎవరు? (లోపల చెయిలేక వేలాడుతోన్న చొక్కా చేయి పట్టుకొని) ఒక్కటే చెయి మీకు! గుర్తించాను. నా ప్రాణ నాథుడవు. స్వామీ! ఏ యపరాధం చేశాను.?

బహా: పన్నా! పన్నా!

(ఉదయుడు బహాదుర్ సింహుని భుజంమీద ఉంటాడు. పన్నా అతని పాదములమీద వాలి పడుతుంది. ఇతర తాంత్రికులంతా ఆశ్చర్యమగ్నులై ఉంటారు. స్థిర దృశ్యము)

(తెర పడుతుంది.)

—×—

# రాజ ముకుటం

## తృతీయాంకము.

### ఒకటవ దృశ్యము

[కమల్‌మీరు దర్బారు. కమల్‌మీరు ప్రభువు మంత్రితో ప్రసంగించుచూ ఉంటాడు. ఇంతలో ద్వారపాలకుడు ప్రవేశిస్తాడు.]

ద్వార : (ప్రణామం చేసి) జయము కమల్‌మీరు ప్రభువులకు! ఎవరో దీనురాలు—ఒకకుర్రవాణ్ణి, ఒకముసలివాణ్ణి, వెంటబెట్టుకొని ద్వారం ముందు వేచియున్నది తమదర్శనం కోసం, తన దుఃఖకథ దేవర వారికి మనవి చేసుకునేందుకు. ఆజ్ఞ అయితే ప్రవేశపెడతాను.

ఆశా : దుఃఖితులకు నా ద్వారం ఎప్పుడూ తెరచే ఉంటుంది. ప్రహరీ ! ఆమెను ప్రవేశపెట్టు.

(ద్వారపాలకుడు వెళ్ళుతాడు. ఆశాశాహ్ మంత్రితో మళ్ళీ సంభాషణ సాగిస్తుంటాడు - పన్నా, బహాదుర్‌సింహుడు, ఉదయుడు ప్రవేశిస్తారు.)

ముగ్గురు : జయము కమల్‌మీరు ప్రభువుకు !

ఆశా : ఎవరూ? నువ్వు ఇలా రావటానికి కారణం?

పన్నా : అంతా మనవిచేస్తాను. కాని—(మంత్రికేసి చూస్తూ చెప్పటానికి సంకోచిస్తుంది.)

ఆశా : (పన్నా అభిప్రాయం గ్రహించి మంత్రితో) మనం మళ్ళీకలుసుకొందాం. ప్రస్తుతం ఈమెవిషయ మేమిటో వినాలని ఉంది.

మంత్రి: చిత్తం ! (అభివాదంచేసి నిష్క్రమిస్తాడు.)

ఆశా: మంచిది; ఇక చెప్పు, నీ కేంకావాలి?

పన్నా : శరణు ప్రభూ ! సమస్త మేవాడ్ ప్రదేశంలో నేడు మేవా

డాధిపతికే ఇంత నిలువనీడ లేకుండాఉంది. (బహాదుర్ సింహుడు కొంచెము చకితుడౌతాడు.)

ఆశా: ఆ మేవాడాధిపతి యెవరు? నీవు ఉన్నతావస్థలో లేవుకద! లేక నీమాటలు గూఢరహస్య గర్భితములా? స్పష్టంగాచెప్పు; నీ కేం కావా లిప్పుడు?

పన్నా: (ఉదయుని ముందు నిలిపి) ఇతడే మహారాణా సంగ్రామ సింహుని చిన్నకొడుకు ఉదయసింహుడు. (బహుదూర్ సింగు ఆపాదమస్తకమూ వొణికిపోయి స్తంభితుడౌతాడు.) ఇతని దాదిని నేను ఘాతకుడైన వనవీరుని కత్తివేటునుండి రక్షించి యిటు తీసుకొచ్చాను; శరణిచ్చి, పోషించండి ఇతన్ని.

బహు: ఏమిటి పన్నా! ఒక్కగుక్కలో చెప్పేశావు? (విచారంగా) చందన్ ఎక్కడ మరి? ఇతడు రాజకుమారుడు ఉదయుడా?

పన్నా: ఔను. ఇతడే రాజకుమారుడు ఉదయుడు.

ఆశా: అయితే మరి ఉదయసింహుడు వనవీరునిద్వారా హత్య గావింపబడ్డట్లు లోకంలో ప్రతీతిగా ఉంది. నీ వెలాగ రక్షించి తెచ్చా వితన్ని?

పన్నా: స్వంత కొడుకును బలియిచ్చికొని.

బహు: (ఉత్సుకుడై) ఎవర్ని? చందన్‌నా?

పన్నా: (విచారంగా) ఔను చందన్‌నే (బహుదూర్ సింగు హాతోత్సాహు డౌతాడు.) నాకు హంతకుని యుద్దేశం తెలిసింది; వనవీరుడు రాకముందే ఉదయుని సెజ్జమీద చందన్‌ని పడుకోబెట్టాను. ఎందుకోసం నాకన్నకొడుకునుకూడా బలియిచ్చుకున్నానో అందుకోసమే మీరుకూడా ఇతన్ని రక్షించండి.

బహు: ఇదంతా వినిపించేందుకా నన్నీ రాజదర్బారుకు తీసుకొచ్చావు? పన్నా! ఈసంగతి ఇంతవరకు నాకుచెప్పకుండా దాచి యుంచినదానివి, అలాగే, గుప్తంగానే ఉంచలేకపోయావా? ఇతడు చందన్ కాదని ఎందుకు చెబుతున్నావు?

పన్నా : అయితే పవిత్ర చిత్తోడు వంశము నిర్మూలమై పోవడము మీ కిష్టమేనా ! మనసేవ అమరమైనదిగా చేసుకోవలెనంటే యజమాని ప్రతిష్ట నిలువబెట్టాలి; అందుకు బలిదానమైనా చేయవలసి వుంటుంది.

బహు : నేను సంసారాన్ని, సమాజాన్ని త్యజించి నిర్జనారణ్యాల అంధకారంలో దేన్నో వెతుక్కుంటూ ఉన్నాను. ఇంత కాలానికి రాజకుమారుని వదనం కనిపించింది. నీ కేమో ఇతడే పుత్రు డన్నావు.

పన్నా : పోనీ, మీమాటుకు మీరే ఆలోచించండి; ప్రభుక్షేమం కోరి పుత్రుణ్ణి బలియిచ్చుకోవటం పాపమేమో. చందన్ మరణించ లేదు. ఆ అనంతనీలిమాకాశంలో అదుగో అతడుకూడా ఒక తార. ఇతన్నే చందన్‌గా భావించుకోండి. తానుకూడా చందన్ ననే చెప్పుకుంటున్నాడు.

బహు : పుత్రుడనే మృగతృష్ణచూపించి నన్ను మళ్ళీ ఈమాయా సంసారములోకి ఆకర్షించావా?

పన్నా : (రాజుతో) ఈ రహస్యమంతా నేనుగాక రాజమహాలులోని ఒక్క బారీమాత్రం ఎరిగున్నాడు. అత డిది గుప్తంగానే ఉంచుతానని ప్రమాణం చేశాడు మీ రైనా దీన్ని ఎక్కడా చెప్పకుం రని ఆశిస్తున్నాను.

బహు : నేనుకూడా అలాగే చేయాలి కాబోలేం!

పన్నా : ఔను. మీ రెప్పుడైతే ఇతన్ని చందన్‌గా భావించుతారో అప్పుడే ఈ రహస్యం తనంతట అదే గుప్తంగా ఉండిపోతుంది.

ఆశా : నువ్వు కోరినట్టు ఈ రహస్యం ఎంతో జాగ్రత్తగా గుప్తంగానే ఉంచుతాం. నీ రాజభక్తి అమూల్యమైనది; సందేహం లేదు. కాని నీకు తెలుసునుకదా ! మహారాణా వనవీరుని చక్రవర్తిత్వం ముందు కమల్ మీరు అధిపతి యొక లెక్కలోవాడు కాడు. నీవే చెప్పు; దుర్బలుడు ఆశాశాహుడు ఆయనశత్రువుకు ఆశ్రయం

ఇవ్వగలడేమో! అది మహారాణా వనవీరునికి తెలిస్తే ఆశాశాహుని తల ఎక్కడికెగిరి పడుతుందో బాగా ఎరుగుదును.

పన్నా: మీరు తప్పక శరణివ్వాలి. మీమీద నేకొండంత ఆశ పెట్టుకు వచ్చాను. మీ రింత పిరికివారా! ఆ హంతకుడి కంత ప్రతాపం ఉందా? రావుజీ! నా ఆశ నిరాశ చేయవద్దు

(ఆశాశాహుని తల్లి ప్రవేశిస్తుంది.)

రాజమాత: నీవు మరచిపో లేదనుకుంటాను, నాయనా! ఒకసారి యుద్ధభూమిలో ఆయన నీ ప్రాణాల్ని కాపాడి, తొంభైగాయాలతో నిండియున్న తనశరీరాన మరొక గాయాన్ని కూడా సహించాడు. అంత ఉపకారియైన స్వామిసేవ తప్పకుండా నిర్వహించాలినాయనా! (పన్నాతో) అమ్మా! నీ మాటలన్నీ చాటునుండి విన్నాను. నీవు పూనుకున్న ఈ రహస్య ప్రయత్నంలో సమ్మిళితను కావాలనే నిశ్చయించుకొని వచ్చాను.

పన్నా: రాజమాత అనుగ్రహానికి ఋణగ్రస్తురాల్ని.

రాజమాత: (ఆశాశాహునితో) రాజకుమారుడికి శరణు ఇవ్వక తప్పదు. ఇతని పాలన-పోషణ-భారం నేను వహిస్తాను.

ఆశా: నీ బలవంతంమీద ఒప్పుకోవలసివస్తున్నది. కాని అమ్మా! ఈసంగతి అత్యంతగుప్తంగా ఉండాలి. కాశీలో ఉన్న నా చెల్లెలి కొడుకుకూడా ఇంతేపొడుగు, లావూ ఉంటాడు. ఈ రాజకుమారుడిక్కడ నా చెల్లెలి కొడుకుగా వ్యవహరింపబడుతూండటం మంచిది.

రాజమాత: అట్లేకాని; భయపడవలసిన పనేమీ లేదు.

ఆశా: అట్లనకమ్మా! ఈ సంగతి అణుమాత్రమైనా వనవీరునికి ఆచూకీ తెలిస్తే తన గూఢచారుల్ని నాల్గువైపులకు తరుముతాడు.

బహు: అటువంటి చింతేమీ పెట్టుకోకండి రావుజీ! ఈ రహస్య — ద్వారంముందు నేను చౌకీదారుగా ఉంటాను. మీరేమీ భయపడవద్దు. నేను నీడవలె రాజకుమారుని వెంటఉండి, ఈ రహస్యం

బయలుపడకుండా కాపాడుతాను. ఈ నా దక్షిణహస్తం సంగ్రామసింహుని సేవయందు అర్పించాను. మిగిలిన ఈ సమస్త అవయవాలు సంగ్రామసింహ పుత్రుని రక్షణకే వినియోగ పడేందుకు సిద్ధంగా ఉన్నవి. ఇంతవరకూ నాకుమారుడే అన్న భ్రమలో ఉన్నాను. ఆ భ్రమే సత్యమనుకుని ఇతన్ని నాకొడుకుగానే చూచుకుంటాను.

రాజమాత : రాజకుమార్ ! నీకు స్వాగతం.

పన్నా : అమ్మా! న్యాయానికి చేయూత నిచ్చావు. నీకు జయం

ఉద : అమ్మా! నీవూ ఇక్కడే ఉంటావుకదూ ?

పన్నా : ఆ; ఇక్కడే ఉంటాను. ఒక్కసారిమాత్రం చిత్తోడుకు వెళ్ళి నా ఆవశ్యకమైన వస్తువులు కొన్నింటిని తెచ్చుకుంటాను. ఇక నాకు నిశ్చింత. ఇంకా కొన్ని యితర విషయాలమీద నే నిక మనస్సు ఉంచాలి. వనవీరున కేమీ అనుమానం కలగకూడదు; నాపనులూ నెరవేరాలి. నేను ఇవాళే, ఇప్పుడే వెళ్ళుతున్నాను.

బహు : నేను ఉన్నాను. నీ అనుచరుణ్ణి రాజకుమార్ !

(పన్నా చిత్తోడు ముఖంగా వెళ్ళుతుంది. బహదూర్‌సింగు రాజకుమారునిదగ్గరకు వస్తాడు.)

(తెర పడుతుంది.)

---

## రెండవదృశ్యము

[వనవీరుని మహలు. ఉత్తేజితుడై వనవీర్, అతనివెనుక ఛందావత్ సర్దారు ప్రవేశిస్తారు]

వన : ఛందావత్ సర్దార్ ! ఎల్లప్పుడూ రాజభక్తుడవుగా సంచరించినవాడివి, ఇవాళ నీకింత దుస్సాహసమా? నేను స్వయంగా నా చేతులతో అర్పించిన పాయసపుదొన్నె స్వీకరించావుకాదు.

ఛందా : అయితే, అంతమాత్రాన ఏమి మునిగిపోయింది ?

వన : నీ కది స్వీకృతం కానప్పుడు పిందు కసలురావడం దేనికి?

ఛంద : నన్ను వంచించి ఆహ్వానం పంపారు.

వన : సమస్త సర్దార్లమధ్యన నన్నవమానించావు. పుండు సలుపుపెడుతోంది సర్దార్! అవమానాగ్ని లోలోపల రాజుకుంటోంది.

ఛందా : మహారాణాగారి యీ ఆదరతృష్ణ ఎందు కింత అధికమౌతోందో నాకు అర్థం కావటంలేదు. గౌరవలాలసత్వం ఎంత ప్రబలమౌతూఉన్నదో వినతములై యుండవలసిన తల లంత పైకి లేస్తున్నవి.

వన : మరి ఇదేమిటి? చిత్తోడేశ్వరుడిచ్చిన పాయసపుదొన్నె నీ వెందుకు స్వీకరింపలేదు?

ఛందా : చిత్తోడేశ్వర్! (కొంచెమాగి) కాదు. పాయసపుదొన్నె యివ్వగల అధికారం తమ కేమాత్రమూ లేదు. ఒకవేళ—పరమేశ్వరుని కృపవల్ల అట్లు జరుగనుగాక—గుజరాత్ సుల్తాను మరొకసారి చిత్తోడుపై అధికారం చలాయించటము సంభవిస్తే అత డిచ్చే దొన్నె మేము స్వీకరింపవలసిన దేనా? ఎన్నటికీ స్వీకరించము. బప్పారావు శుద్ధవంశంలో జన్మించినవారికితప్ప ఇంకొకరికా అధికారం లేదు.

వన : నేను సంగరాణా సోదరుడైన పృథ్వీరాజు పుత్రుణ్ణి కామా?

ఛందా . ఇంకా స్పష్టంగా చెప్పమంటారా?

వన : నీ వాక్యాలు నా అభిజాత్యాన్ని, పవిత్రతనూ శంకిస్తున్నై. చెడ్డ అసహ్యంగాఉంది నీ వ్యవహారం. నీసంగతేమిటో అంతు కనుక్కోవాలి.

ఛందా : నా అంతు కనుక్కునేముందు తమ రింకొకర్ని ఎదుర్కోవలసివుంది. మీా రేస్వప్నవీథుల్లో ఉన్నారో! కమల్ మీారు సమాచారం వినలేదేమో!

వన : (చింతితుడై) కమల్ మీారు సమాచారం! ఏమిటది?

ఛందా : ప్రస్తుత—చిత్తోడు—మహారాణాకు చాలా విచారకర

మైనదే పాపం! తమరు వీవంశాన్ని నిష్పంటించి నిర్మూలం చేశామనుకుంటున్నారో ఆవంశపు దీపిక కమల్‌మీర్ కోటలో వెల్తురులు చిమ్ముతోంది.

వన: అంటే?

ఛందా: ఉదయ సింగు జీవించే ఉన్నాడు.

వన: (కంపితుడై) జీవించే ఉన్నాడా?

ఛందా: చిత్తం. అదీగాక, ఇంతకన్న విచారకరమైన విషయం మరొకటి; మేవాడ్‌లోని ప్రముఖ సర్దార్లంతా అతనికి తోడ్పడేందుకు సిద్ధంగా ఉన్నారు.

వన: మహా అయితే ఏమౌతుంది? వీరంతాకలిసి చిత్తోడుమీదికి దండెత్తివస్తారు, అంతేనా? అయినా నీ మాటలు నేనెందుకు విశ్వశిస్తాను! నేను ఉదయుణ్ణి ఈచేత్తో పొడిచేశాను. ప్రాణాలు విడుస్తూ అత డప్పుడు చేసిన చీత్కారం నాకిప్పటికీ జ్ఞాపకంఉంది.

ఛందా: తమరు భ్రమపడ్డారు, అతడు ఉదయుడుకాడు.

వన: మరింకెవరు?

ఛందా: దాది పన్నా కుమారుడు. రాజమాత నామాటలు నిజమేనని రుజువు చేస్తాడు కావాలంటే. నేనూ వెళ్ళిపోతున్నాను. (పోబోతాడు)

వన: ఆగు! ఎక్కడికి వెళుతున్నావు?

ఛందా: మీకేమీ భయం లేదుగా! కమల్‌మీరు వెళుతున్నాను. చిత్తోడు రాజ్యానికి నిజమైన ప్రభువు అక్కడే ఉన్నాడు.

(ఛందావత్ సర్దారు నిష్క్రమిస్తాడు. రెండవవైపునుంచి శీతలసేని ప్రవేశిస్తుంది.)

శీత: తక్షకుడు బ్రతికిపోయాడు నాయనా! నీవు కాలిక్రింద నలచి వేసినది కేవలం రజ్జువే సుమా!

వన: ఔను. ఇప్పుడే అంతా విన్నాను భ్రమపడ్డాను. సత్యాన్ని అసత్యంనుంచి పృథక్కరించలేకపోయాను. (రణజిత్తు ప్రవేశిస్తాడు)

రణ: ఛందావత్ సర్దారు విద్రోహి అయాడు. రాజవీథుల్లో ప్రజ

లతో "మీ అసలైన రాజు ఉదయుడు జీవించే ఉన్నాడు" అని అరచుకుంటూ పోతున్నాడు.

వన : జీవించే ఉండనీ, రణజిత్తు ! ఏం చేయగలుగుతాడు ?

రణ : అతడు జీవించి యుండట మనేది అసంభవం మహారాజా ! ఇది నిస్సందేహంగా విద్రోహులై పోయిన మనసర్దార్ల మాయ. ఒకానొక అబద్ధపు త్యాగకథ ఒకన్నాకు కట్టిపెట్టి వీళ్ళు ఏనుట్టి బొమ్మలోనో ఉదయుడి ప్రాణాలిస్తే ఉన్నాడు. అంతేకాని వాడెవడో ఉదయుడుమాత్రం కాజాలడు.

వన: ఏమైనా కానీ, మహారాజా వనవీర్ ఎవరికీ భయపడేవాడు కాదు. నేను కేవలం నా బాహుబలంతోనే వాళ్లందర్నీ ఎదుర్కొంటాను. పైగా కావలసినంత సేన ఉంది; సకాలానికి వేతనాలిచ్చి పోషిస్తున్నాను. సైనికులంతా నాకోసం ప్రాణా లర్పించటానికికూడా సిద్ధంగా ఉన్నారు. ఇప్పుడే రాజసభ సమావేశం కావాలి. పద, ఈ విషయమంతా అక్కడే విచారిద్దాం. (వనవీర్, రణజిత్తు నిష్క్రమిస్తారు)

శీతల : రణజిత్ ఊహ సరైందికాదు. అతడు ఉదయుడే, మరెవరూ కాదు. రాక్షసి పన్నా ఈ ప్రపంచములో ఏమిసుఖం కోరి సొంత కొడుకునే మింగివేసిందో అర్థం కావటంలేదు. వైరిబాలకుడు బ్రతికి పోయాడు-వాడు బ్రతికియుండకూడదు. నేనే స్వయంగా కమల్ మీరు వెళ్ళి అతణ్ణి ఈసారి తప్పకుండా నిర్మూలనం చేసి వస్తాను. రణజిత్తు వల్లకూడా కాదీపని. మారువేషం ధరిస్తాను; నాకట్టి సాహసంకూడా ఉంది. (నిష్క్రమిస్తుంది)

(తెర పడుతుంది)



## మూడవ దృశ్యము

[కమల్ మీద రాజమార్గము - తెరలో భిక్షుకుడు పాడుతుంటాడు.]

భైరవి—త్రితాళం

ఆప్తులను వారిలను లేరందీ ,
సుఖ వైభవ మొకఛాయ సుమందీ ,
ఆశలు మృగతృష్ణలు నమ్మందీ ,
లోభ మోహములలో బడకందీ ,
జగజీవన మిదికలయే నందీ !

[ఉదయుడు, బహదూర్‌సింగు ప్రవేశిస్తారు]

బహ : నా కిదేమీ బాగులేదు—ఉదయ్ ! నువ్వేమో ప్రతిరోజూ పట్టుదలపట్టి నదియొడ్డుకు షికారు వస్తున్నావు. ఇక్కడి ప్రజలందరికీ నువ్వు ఆశాశాహుని మేనల్లుడివిమాత్రం కాదని బాగా తెలిసిపోయింది. నీ వెరుగవ్వూ ?

ఉద : అయితే ఏం భయం ? సంగ్రామసింహ మహారాణా పుత్రుణ్ణని కూడా వాళ్ళకు తెలుసుకోనీయండి. ఏం పెదనాన్న గారూ !

బహ : [ఉదయుని నోటికి చెయి అడ్డంపెట్టి] ఊరుకో, ఊరుకో, ఏమంటున్నావు ! ఈమాటగనక వనవీరుని చెవులదాకా ప్రాకి పోయిందంటే మనకు క్షేమంకాదు.

ఉద : వనవీర్ ! ఆ హంతకుడికి నే నేమీ భయపడను. ఇప్పుడు నేను సంపూర్ణ బలశాలి నైనాను. ఇన్నేండ్లనుంచీ మీవద్ద రణకౌశలము నేర్చుకుంటున్నాను కాదూ ! నే నేమన్నా బండశిష్యుణ్ణా మీకు?

బహ : కాకపోయినా మనము కొంచెం భయపడవలసే ఉంది. వనవీర్ వంటి హింసాత్మకుణ్ణి నే నెక్కడా చూడలేదు; అతడంటే నా కెంతో భయం. అదీకాక ఉదయ్! నీవు నిన్ను నీ అసలు రూపులో ప్రకటించు చేసుకోవాలని ఎందు కంత ఆత్రపడతావు? స్వయంగానే తెలిసిపోతోందిగా అందరికీ ! ఆనాడు నీవు కమల్ మీరు దర్బారు

తరఫున శోణిగురు సర్దారుకు స్వాగతం ఇచ్చినప్పుడు, ఆయన నీ ధీరలక్షణాలకు చకితుడై అన్నాడుకాదూ : "ఇతడు ఆశాశాహుని మేనల్లుడుమాత్రం ఎప్పటికీ అయిఉండడు' అని.

ఉద : ఔను. ఆ తర్వాత మీకు తెలియదేమో : ఆయన తన అనుమానాన్ని ఆశాశాహుకు తెలియజేశాడు. ఆశాశాహ్ ఏమీ దాచకుండా నా నిజ సమాచారమంతా ఆయన కెరుకపరచాడు. అప్పుడు శోణిగురుసర్దారు నన్ను కౌగలించుకొని "నాయనా! నీ పూర్వజుల సింహాసనం తిరిగి స్వాధీనం చేసుకోవాలని నీకు అభిలాష కలిగినప్పుడు నన్నుకూడా జ్ఞాపకం తెచ్చుకో. బప్పారావు-వంశ-గౌరవ-ఉద్ధారణకు నేనుకూడా మహదానందంతో సహాయం చేస్తాను" అన్నాడు.

బహా : సహాయం విషయంలో నీకేమీ లోటుండదు. బప్పారావు పవిత్రనామమే మంత్రమువలె పనిచేస్తుంది. ఏనాడు నీ నిజరూపం అందరికీ ప్రకటమౌతుందో ఆరోజు చూడాలి.

ఉద : ఎందుకు దబ్బున ప్రకటం కానీరు మీరు? నే నీవిధంగా దాగి ఉండలేను. ఈ పంజరం తలుపులు తెరచివేయండి; ఆ విశాలాకాశంలో స్వేచ్ఛగా సంచారం చేయా లనిపిస్తుంది.

బహా : [పాడుతూ వస్తోన్న బిచ్చగాణ్ణిచూచి] ఊరుకో, ఊరుకో, ఎవరో వస్తున్నారు.

[ఒక ముసలి గ్రుడ్డిబిచ్చగాడు పాడుతూ ప్రవేశిస్తాడు]

బిచ్చ : కంటకచయమే మార్గమునిండా,
దుఃఖ—క్లేశములె లోకమునిండా,
విరహ—వియోగ—విషాదమే అంతా,
ఆశాకల్పనలే బ్రతుకండీ!

రక్షించండి బాబా! రక్షించండి! మూడు రోజులనుంచీ తిండి లేదు. ఒక్క-కబళం! అయ్యో భగవంతుడా! [ఇలా అంటూ కర్రసాయంతో నిష్క్ర-మిస్తాడు]

బహా : ఓపికపట్టు నాయనా ! ఆ రోజు దానంతట దే చేరువకు వస్తుంది. [పొడుంకోసం జేబులో చెయ్యిపెట్టి- డబ్బీ కనపడక] కాని, అసలు విషయం మరచిపోయాంసుమా ! నేను పొడుం డబ్బీ నది యొడ్డున విడిచిపెట్టి వచ్చేశానూ !

ఉద : పెదనాన్నగారూ ! మీకెప్పుడూ ఇదే మాట. మీ అలవాట్లు పొరపాట్లతో నిండిఉంది ఈ మరచిపోయే స్వభావమున్నా మాను కోండీ, లేదా పొడుంపీల్చే అభ్యాసమైనాను.

బహా : ఆ రెండింటిలో దేన్ని మానుకోటానికి పీల్లేదప్పుడు. నేనైనా వాటిని బ్రతికియుండగా విడిచిపెట్ట దలచుకోలేను. అవి నా యునికి కెంతో ఆవశ్యకం. నీ విక్కడే ఉండు కాస్సేపు. పొడుం డబ్బా వెదకి తీసుకొస్తాను. (బహాదుర్ సింహుడు నిష్క్రమిస్తాడు)

(బిచ్చగాడు పాడుతూ ప్రవేశిస్తాడు)

శ్యామసుందరుడు యశోదపుత్రుడు,
వ్రజమోహనుదే పాలకుడండీ ;
ఆ మహామహుని దివ్యనామమే
జపించండీ; వెలుగు చూడండీ ;

బిచ్చ : దాతలుమీరు; రక్షించండీ, రక్షించండి !

ఉద : ఎవరబ్బీ నువ్వు ? ఎప్పుడూ జ్ఞానోపదేశం చేస్తూఉంటావు ఇక్కడ రాజమహాలు సమీపంలో నిన్ను చాలాసార్లు చూచాను

బిచ్చ : చూచియుంటావు బాబూ ! నాకు చూపు చాలా తక్కువ నాకన్నుల్లోని వెలుగు ముసలితనం హరింపచేసింది.

ఉద : నీ పేరు ?

బిచ్చ : వ్యవహారంలో ఉపయోగానికి రాకపోవడంచేత జ్ఞాపకంలేదు

ఉద : నీ ఇల్లు ?

బిచ్చ : బిచ్చగాడికి ఇల్లా !

ఉద : ఇక్కడ ఎక్కడుంటున్నావు మరి ?

బిచ్చ : దేవాలయం దగ్గర బావి ఉందే , దానికి కొంచెందూరంలో

వున్న రావిచెట్టు కింద వెయ్యి కాలాలపాటు బ్రతుకుతావు బాబూ! నేను మొన్నటినుంచీ అన్నం మెతుకు నోటికి రాలేదు.

ఉద : పాపం !

బిచ్చ : భగవంతుడు నిన్ను చల్లని చూపు చూస్తాడులే నాయనా!

[నాలుగు డబ్బు లిద్దామని ఉదయుడు లోపలి జేబులోకి చెయి పోనిచ్చినప్పుడు బిచ్చగాడు దాచి తెచ్చిన కటారు వెలికి తీసి, ఉదయుని పొడవ పోతాడు. హఠాత్తుగా బహుదూర్‌సింగు వచ్చి, బిచ్చగాడి చెయ్యి పట్టుకుంటాడు. బిచ్చగాడు కటారు విసరివేసి చెయి విదిలించుకొని పరుగెత్తపోతాడు. బహాదూర్‌సింగు వాడి చెయి విడిచి, గడం పుచ్చుకుని నిరోధింప చూస్తాడు; అది అతికించుకున్న గడ్డం కావడంచేత చేతిలోకి వచ్చేస్తుంది. బిచ్చగాడు పరుగుపెడతాడు, బహాదుర్‌సింగు కొంతదూరం వాణ్ణి అనుసరించి విఫల ప్రయత్నుడై తిరిగి వస్తాడు. ఉదయుడు నేలమీది కటారు తీసుకుంటాడు)

బహా : (తిరిగివచ్చి) పరుగెత్తి గుంపులో కలసి పోయాడు. చూచావా ఉదయ్! బాగా తెలిసివచ్చిందా?

ఉద : (కటారు చూపిస్తూ) తెలిసింది. మీరు మళ్ళా నన్ను మృత్యువు నుండి తప్పించారు. కాని, ఆశ్చర్యంగా ఉంది. మీరు సరిగ్గా సమయానికి వచ్చారే!

బహా : — ఈ బిచ్చగాణ్ణి చాలా రోజులనుంచీ చూస్తున్నాను. వీడు నన్నూ, విశేషించి నిన్నూ, ఒక కంట ఎప్పుడూ కనిపెడుతూనే ఉన్నాడు. ఒకనాడు కన్నులు పత్తికాయలవలె విప్పి నీకేసిచూస్తూంటే నా కంటబడ్డాడు. అప్పటినుంచీ వాడంటే నాకు అనుమానంగానేఉంది. ఎందుకంటే తాను గ్రుడ్డివాణ్ణనని చెప్పుకుంటున్నాడు. ఇప్పుడు నేను నదియొద్దకు వెళ్ళి తిరిగివస్తూన్నప్పుడు వాడు నీముందు నిటారుగా నిలబడియున్నాడు. అంధత్వము వలెనే ముసలితనంకూడా అబద్ధమేనని గ్రహించాను. గబగబ పరుగెత్తుకుంటూ వచ్చాను. వస్తూవస్తూండగానే వాడు నీమీద కటారు విసరబోతున్నాడు పరమేశ్వరుడి దయవల్ల విఫలుడైనాడు.

ఉద : అయితే, ఈఘాతుకుడు వనవీర్ పంపించినవాడేనా?

బహా : అలాగే తోస్తున్నది. మేము నిన్ను చాలారోజులు దాచియుంచలేకపోయాం. వనవీరుడి కంతా తెలిసిపోయింది.

ఉద : ఎవని శారినుండి నన్ను కాపాడాలని చూస్తున్నారో అతనికే సర్వమూ తెలిసిపోయినప్పుడు ఇంకా ఈ దాగియుండటంవల్ల ప్రయోజన మేమిటి పెదనాన్నగారూ ?

[పన్నా ప్రవేశిస్తుంది]

పన్నా : ఏమీలేదు ఉదయ్ ! ఇంకా నీవు ఎన్నాళ్ళో దాగియుండ వలసిన యవసరం లేదు. మేవాడ్‌లోనేకాదు; సమస్త రాజ స్థానంలోనూ, సర్దార్లు, సిపాయిలు, సంగరాణాపుత్రునితో ఏకీ భవించటానికి సిద్ధంగా ఉన్నారు. కమల్ మీరు ప్రభువు అందరినీ పిలిపించారు. త్వరలోనే వారందరూ రాజదర్బారులో సమా వేశమై నీకు సాయపడే విషయంలో ఆలోచనలు చేస్తారు. ఈసమా చారమంతా ఆయన నా కివాళే చెప్పారు. నీతో చెబుదామని వెతుక్కుంటూ వచ్చాను.

ఉద : నీకు తెలియదేమో, ఇంతకుముందే వనవీరుడు నన్ను వధించేం దుకు రెండో ప్రయత్నం చేశాడు. కాని ఈసారి నన్ను వీరురక్షిం చారు. ఇక నన్నెవ్వరూ చంపలేరమ్మా !

పన్నా : (ఉదయుణ్ణి దగ్గరకు తీసుకొని) పరమేశ్వరుడికి ధన్యవాదం. ఇక మేము నీ రక్షణవిషయంలో మరింత జాగరూకులమై ఉంటాం. పద, త్వరగా మహలుకు పోదాం; వెళ్ళి ఆయనకుకూడా ఈసమా చారం వినిపిద్దాం.

[పోబోతుంది. కాని తెరలో బైరాగి వేషంతో వస్తోన్న జయసింహుని చూచి]

ఎవరు? రావు జయసింహుడు కాదూ! ఈయన బైరాగియై తిరుగు తోన్న సంగతి విన్నాను. కాని వెంటనే గుర్తుపట్టటానికి వీల్లేకుండా ఉన్నాడు.

[జయసింహుడు ప్రవేశిస్తాడు]

జయ : ఎవరూ? ఎవరూ, పన్నా ! నీవు ఇక్కడ, కమల్ మీరులో...

పన్నా : నీదగ్గర దాపరికం ఎందుకు? నేను మేవాడ్ విడిచివచ్చి,

ఏడుసంవత్సరాలనుంచీ ఉదయుణ్ణి పోషించుకుంటూ ఇక్కడే ఉంటున్నాను.

జయ : (ఆశ్చర్యంగా) నాకర్థం కావటంలేదు. ఏఉదయుణ్ణి పోషిస్తూ?

పన్నా : (ఉదయుణ్ణి ముందు నిలిపి) ఇతన్నే; చూడు; గుర్తించలేవూ? ఉదయుడు కాడూ ?

జయ : (మహానందంతో) ఉదయ్ ! ఉదయ్ ! ఔను. ఉదయుడే. ఇది స్వప్నం కాదుకదా పన్నా ! నీవు ఉదయుని బ్రతికించటానికి అమృతం ఎక్కడినుంచి తెచ్చావు ?

పన్నా : ఇంటికి చేరుకున్నతరువాత అంతా చెబుతాను.

జయ : నీవు ధన్యవమ్మా ! నేను శూన్యమతినై, ఏయాశయులేక, ఈప్రపంచములో ద్రిమ్మరుతున్నాను. నీవు నీకర్తవ్యాన్ని పాలించి నాకుకూడా మార్గము చూపెడుతున్నావు. బప్పారావు వంశ వృక్షాన్ని నిలువబెట్టావు. ఇవాళ నాహృదయంలో ఆనందం పొర్లువారుతోంది. [బహాదుర్‌సింహునివైపు చూపుతూ) వీరిని ఎక్కడో చూచినట్లున్నది ?

పన్నా : వీరు నా... ..., కొన్నియుగాలు అదృశ్యులై పోయారే...

జయ : ఓహో, బహాదుర్‌సింహాజీ ! జ్ఞాపకం వచ్చింది. వీరు మా నాన్నగారి మిత్రులు. ఆజ్ఞాపించు, అమ్మా! ఘాతుకుడు సింహాసనంమీద ఉండరాదు. ఇతడూ సంగరాణాపుత్రుడు. [ఉదయుని తల నిమురుతాడు] ఈ భిక్షాపాత్ర నిక విడిచి – మేవాడ్ రక్షణ కోసం – శస్త్ర ధారణ చేస్తాను. (భిక్షాపాత్ర, రుద్రాక్షమాల, మొదలైనవన్నీ విసరి పారేస్తాడు. ఉదయుడాయనకు తన కత్తి నిస్తాడు.)

బహా : నీవు, నా మిత్రుని యోగ్యపుత్రుడవు.

పన్నా: పద, మహాలుకు వెళ్ళుదాం; అక్కడే విషయమంతా సవిస్తరంగా చెబుతాను.

జయ : పదండి, పదండి, ఇంక మన మేవాడ్ దేశమాత రాక్షసుని

ఆయన కిప్పుడు పెద్దగర్వం ఎక్కిపోయింది. తన యిచ్చిన సాయ సపు దొన్ని స్వీకరించమని బలవంతం చేస్తున్నాడు.

ఆశా : మీరందరూ సహాయపడతా మంటున్నారు, బాగుంది. ఇక మన భవిష్యత్‌నుగూర్చి యేమి టాలోచన ?

బహ : ఏముంది ? ఇప్పుడే రణభేరీ మ్రోగిద్దాం. "ఉదయసింహమహా రాణాకు జై" అంటూ చిత్తోడుమీదికి దండెత్తుదాం. నాకు ఒక చేయి మిగిలివుందికదా ! దీనితో డాలు కాదు కత్తే పడతాను.

ఆశా : బహదూర్‌సింగు ! జీవితంలో చాలభాగం యుద్ధక్షేత్రంలో గడిపిన అనుభవశాలివైకూడ ఇంత శీఘ్రంగా యుద్ధానికి బయలు దేరుదామని సలహా యివ్వడంలో నీవు ఆలోచించి మాట్లాడు తున్నట్లు కనిపించటంలేదే ?

బహ : నేను ఆలోచించే చెప్పాను. బహుశః మీకు సైన్యము, ఆయుధ సామగ్రీ స్వల్పముగా ఉన్నదని సంకోచంగా ఉందేమో; అటువంటి చింతేమీ పెట్టుకోకండి. ఉదయుడు బ్రతికియున్నాడని వినగానే మేవాడ్ ప్రజలంతా అతనికి సహాయార్థం కత్తులు పుచ్చుకుని ఇళ్లువిడిచి పరుగెత్తుకుని వస్తారు. ధర్మంకోసం ప్రతి కుర్రవాడూ సైనికుడైపోతాడు. అబలలుకూడా శస్త్రధారణ చేస్తారు.

జయ : నాకూ అదేవిశ్వాసం ఉంది. ఇవ్వాళే బయలుదేరటం దుడు కుగా ఉంటుందని తోస్తే రేపు బయలుదేరుదాం. ఆలసించటం మాత్రం ఉచితంకాదు. మనం యుద్ధసన్నద్ధులమై బయలుదేరిన తర్వాత దారిలోనే కావలసినంత సహాయం లభిస్తుంది. నేను సమస్త - రాజస్థానంలో తిరిగి, తిరిగి వనవీరుడి పాపకథ ఇంటింటా వినిపించి వచ్చాను. వారికి నాపట్ల అభిమానం ఉంది. ఉదయుడు జీవించే ఉన్నాడని తెలిస్తే అందరూ మనకు సాయంగా పరు గెత్తుకు వస్తారు.

ఆశా : అయితే వనవీరుని పక్షాన ఎవరెవరున్నారో ?

ఛందా : మేవాడ్‌లోని - ఇంకా ఆచుట్టుప్రక్కల ఉండే సర్దార్లంతా ఇక్కడే సమావేశమై ఉన్నారు. వీరంతా వనవీరుడంటే అసంతుష్టి చెందినవారే. కొందరు సర్దార్లు మనల్ని దారిలోనే కలసికొంటారు. ఇంకా ఎవరేనా మిగిలివుంటే వారు ఉదాసీనులుగా ఉండి పోతారు. ఇక వనవీరుడికి మిగిలింది ఏమిటి? జీతండబ్బులు తింటోన్న సైన్యం. దానివల్ల ఏమౌతుంది.?

ఆశాశా : [ఉదయుని వైపు తిరిగి] చిత్తోడుకు మహారాణా మీరు. యుద్ధానికి బయలుదేరే విషయంలో మీ అభిప్రాయం ఏమిటి.?

ఉద : [సింహాసనం నుంచి లేచి] ఏముంది? యుద్ధమార్గమే నిశ్చయం చేసుకుందాం. ఇవాళే యుద్ధసామగ్రి, సైన్యం, సమకూర్చుకుందాం. రేపు ఉదయమే యుద్ధం.

ఆశాశా : సరే; మాకు మహారాణా ఆజ్ఞ శిరోధార్యం.

అందరు : మేవాడ్ మహారాణాకు జై!

[అందరూ కత్తులెత్తి జయశబ్దం పలుకుతారు]

(తెర పడుతుంది)

---

## ఐదవ దృశ్యము

[యుద్ధక్షేత్రం. వనవీరుడు, శీతలసేని ప్రవేశిస్తారు]

వన : సువ్వీ భయంకర యుద్ధక్షేత్రంలోకి ఎందుకొచ్చావమ్మా! మూడు రోజులనుంచీ నేను ఓడిపోవటమే సంభవిస్తున్నది. ఇప్పుడు కేవలం ఒక పిడికెడు సైన్యం మాత్రమే నా పక్షానఉంది. ఇవాళ తప్పకుండా ఏదో నిర్ణయమౌతుంది.

శీతల : విచారపడకు. విజయము నిన్నే వరిస్తుంది.

వన : ఒకప్పుడు నేనూ అలాగే భావించాను. కాని అది పొరపాటు. నాకు విజయం కలగటం అసంభవం. నేను బాగా ఎరుగుదును.

అయినా యుద్ధం చేస్తాను; అంతకంటే గత్యంతరం లేదుకదా! లేక శస్త్రం పారేసి, నీళ్ళు నమలుతూ, ఉదయుని శరణు వేడుకో మంటారా? అందుకైనా కాలం మించి పోయింది. (తెరలో రణ వాద్యాలు) విన్నావా? అవిగో నా సైనికుల రణ వాద్యాలు. సైన్యం వస్తోంది. నేనిక వెళ్ళాలి. నువ్విక్కడెందుకు? ఇక కాసే పులో భయానక చిత్రవధ జరుగ బోతోంది. వెళ్ళిపో అమ్మా!

శీతల : నీ క్షేమ సమాచారం తెలియక వ్యాకులపడి వచ్చాను. ఇక వెళుతున్నాను.

(వనవీరుడు నిష్క్రమిస్తాడు)

ఊహు : వెళ్ళను. నా ప్రాణాలు వనవీర్ కోసం తహతహలాడిపోతు న్నాయి. ఇక్కడే ఉంటాను. (ఒక చెట్టుకేసి చూపుతూ) ఈ చెట్టెక్కి యుద్ధగతి అవలోకిస్తూ ఉంటాను. అవసరమైతే నేనూ శస్త్రం పడతాను.

(వనవీరుని నాయకత్వంక్రింద కొంతసైన్యం ప్రవేశించి నిష్క్రమిస్తుంది. తరువాత రణవాద్యాలు. అనంతరం ఉదయసింహుడు, జయసింహుడు, బహదూర్ సింగు, ఆశా శాహ్, ఛందావత్ సర్దారు, ప్రవేశిస్తారు.)

—: ఉదయుని సైన్య గీతిక :—

అర్పించు సైనికా ! తను ధనములు !
రక్తప్లుత భీషణ రణసీమన్
మోహము చొరనీకుము చిత్తమునన్
కత్తియాడనీ రిపు కంఠములన్
ధర్మముకొరకే జీవనములు !
భయపడబోకుము రిపు సంతతికిన్
క్షయమౌ వారల సర్వశక్తులున్
జన్మభూమికి జై యనుచున్
ప్రతినదింపుమీ త్రిభువనములు !

(గీతిక సమాప్తిచేసి ఆశాశాహ్, బహదూర్ సింగ్, ఉదయసింహుడు, ఛందావత్ సర్దార్, జయసింహుడు తప్ప మిగిలినవా రంతా నిష్క్రమిస్తారు.)

ఆశా : మన సైన్యమంతా నాలుగుభాగాలు చేశాం. తూర్పుదిక్కున అంత భయపడవలసిన యవసర మేమీ లేదు. ఈరోజున అక్కడ యుద్ధం సామాన్యంగానే ఉంటుంది. బహదూర్ సింగ్! నీవు ఉద యుని వనుగుతో వెంటవుండి ఆయన్నూ, మేవాడ్ జండానూ రక్షిస్తూ ఉండు.

బహ : మంచిది. పన్నా కోరికకూడా అదే.

ఆశా : ఛండావత్ సర్దార్! మీరు పశ్చిమ సైన్యానికి నాయకత్వం వహించండి.

ఛండా : చిత్తము.

ఆశా : జయసింగ్! నేను ఉత్తరానికీ, మీరు దక్షిణానికీ మన మన సేనలను నడుపుకుంటూ వెడదాం. ఈవిధంగా వనవీరునీ, అతని శేషిత సైన్యాన్నీ నాల్గువైపులనుంచీ ముట్టడించగలం. పదండి తొందరచేద్దాం.

("ఏకలింగ భగవాన్‌కీ జై" అని పలుకుతూ అందరూ నిష్క్రమిస్తారు. తెరలో రణ వాద్య ధ్వనులు. గాభరాగా రణజిత్తు ప్రవేశిస్తాడు.)

రణ : ఇవాళ ప్రాణాలు నిల్చేట్టులేదే! వ్యర్థంగా ఈ ఆపద అంతా నేనే కొనుక్కు తెచ్చుకున్నాను. ఇంతఃమంది సర్దారులు వనవీరుడి నుంచి ముఖం తప్పించి వెళ్ళిపోయారు. నేనూ అలాగేచేస్తే బాగుండిపోయేదే! ఏంచేస్తాడేమి టీవనవీరుడు? ఇప్పటికైనా మించిపోయిందా?

( జయసింహుడు ప్రవేశిస్తాడు )

జయ : ఆగు-ఆగు! పాపీ! నీవు వనవీరుడికికూడా విశ్వాసపాత్రుడివి కావు. అతడిప్పు డాపత్తులో తలమునిగి వుంటే నీవు యుద్ధం చేయకుండా ఈమూలవచ్చి దాక్కున్నావా?

రణ : దాక్కోలేదు. మీతోకలసి మీపక్షాన యుద్ధంచేయా లనుకుం టున్నాను.

జయ : ఛండాలుడా ! నీవు పిరికిపందవేకాదు, స్వామిద్రోహివి కూడాను. నీకోసమే వెతుకుతున్నాను; నిన్ను సంహరించేందుకే యుద్ధభూమిలో అడుగుపెట్టాను.

రణ : నేను నీకేమపకారాధం చేశాను? వనవీరుడుకి మిత్రుణ్ణవడమేనా?

జయ : నీవు మహారాణా విక్రమునికికూడా మిత్రుకివే. నిన్నిప్పుడు ప్రాణాలతో విడిచిపెడితే మహారాణా ఉదయునికికూడ మిత్రుడివై పోగలవు. ఈసమస్త రక్తపాతానికి నీవే మూలకారణం. కత్తి తియ్యవేం? నువ్వు బ్రతికియుండగూడదు.

రణ : ఇదిగో తీస్తున్నాలే కాచుకో దెబ్బ. యుద్ధక్షేత్రంలో మహా ఉపదేశాలు మొదలుపెట్టావు. దురభిమానీ! కానీ!

(ఇద్దరు కత్తులతో యుద్ధంచేస్తారు. రణజిత్తు గాయపడి నేల కొరిగిపోతాడు.)

రణ : ఆగు-ఆగు! ఈరహస్యాన్ని నాతోకూడా పట్టుకెళ్ళాలనిలేదు.

జయ : ఏరహస్యాన్ని ?

రణ : (శీతలసేని లిఖితపత్రాన్ని ఇచ్చి) తీసుకో. యుద్ధానంతరం వనవీరుడు బ్రతికివుంటే అతని కందజెయ్యి.

జయ : ఏమిటిది ?

రణ : ప్రధానమంత్రి పదవి. చివరకు నాకది లభించనేలేదు. దాని కోసమే నీ తండ్రిగారిని హత్యచేశాను.

జయ : నీవేనా ఇన్నాళ్ళూ దాగియున్న నాపితృహంతకుడివి? ఇప్పుడిక నీకేమిదండన యిచ్చేది. పో; ప్రతిఫలం పొందావులే.

(రణజిత్తు మరణం)

రణ : [క్షీణస్వరంతో] క్షమించు; క్ష-మిం...

జయ : క్షమించాను; సుఖంగా నిద్రపో.

[ఈసమయాన చెట్టుకొమ్మ శీతలసేని బరువుకు విరిగి పడిపోతుంది. కొమ్మతోపాటు శీతలసేని కిందపడుతుంది.]

ఈ చెట్టుకొమ్మ విరిగి పడ్డదే! దీనికింద ఎవరో స్త్రీ అణగి పడి

వుందే! అభాగిని! చచ్చిపోయినట్లుంది, పాపం! (తెరవేపు చూచి) శత్రుసేన వచ్చి పడుతోంది, వెళ్ళాలి.

(నిష్క్రమిస్తాడు.)

(ఇరుపక్షాలసైనికులూ కొందరు యుద్ధంచేస్తూ ప్రవేశించి, నిష్క్రమిస్తారు.)

(ఆశాశాహ్, వనవీర్-ఇద్దరూ కత్తులతో యుద్ధంచేస్తూ ప్రవేశిస్తారు. అప్పుడే బహూదూర్‌సింగ్ కూడా ప్రవేశం.)

బహూ : ఆగు-ఆగు! నా పసికూనను మింగివేసిన పాపీ! నిన్ను సంహరించడం నావంతు

(ఉదయసింహుడు ప్రవేశిస్తాడు.)

ఉద : కాదు, కాదు, పెదనాన్నగారు! ఇతన్ని నేను వధిస్తాను. ఇతడు నాతమ్ముడు చందన్‌నేకాక మహారాణా విక్రమసింహుని కూడ చంపాడు.

(అప్పుడే పన్నాకూడా ప్రవేశిస్తుంది.)

పన్నా : శాంతించండి. అపకారికి తిరిగి అపకారమే చేయటం ఉచితం కాదు. వనవీర్‌ను వధిస్తే విక్రమసింహరాణా తిరిగి వస్తాడా? చందన్ బ్రతికి వస్తాడా. ?

(వనవీర్ కత్తిపారేసి యుద్ధం మానేస్తాడు)

వన : ఇప్పుడీకత్తిమీదకూడా నాకాశ యేమీలేదు. మీరందరూ కలసి నన్ను వధించండి.

పన్నా : వద్దు. వనవీర్ చావకూడదు. అతన్ని బంధించండి.

ఉద : అమ్మ ఆజ్ఞ శిరోధార్యం. సైనికులూ, వనవీర్‌ను బంధించండి.

(ఇద్దరు సైనికులు వచ్చి వనవీర్‌ను బంధిస్తారు. ఒకవేపునుంచి జయసింహుడు, మరొకవేపునుంచి ఛందావత్ సర్దారు ప్రవేశిస్తారు.)

జయ : శత్రుసైన్యమంతా పరాజితమై పోయింది.

ఛందా : చిత్తోడ్‌కోట ప్రవేశించటానికి ఆటంక మేమీలేదు.

అందరు : జై. మేవాడ్ మహారాణాకు జై.!

(అందరూ వెళ్ళిన చివరకు పొడుం పీలుస్తూ బహూదూర్‌సింగు వెళతాడు)

(తెర పడుతుంది.)

## ఆరవ దృశ్యము

[పట్టాభిషేకం. సింహాసనం మీద ఉదయ సింహుడు. బహుదూర్ సింగు, ఆశాశాహ్, ఛందావత్ సర్దారు, జయసింహుడు మొదలైనవారు వారివారి ఆసనాలమీద. రాజమకుటం పట్టుకొని పన్నా నిలువబడి ఉంటుంది.]

పన్నా : ఇవాళ సుదినం. ఇదిగో చిరకాలంనుంచి అపేక్షిస్తోన్న రాజమకుటం. ఇది నీమస్తకముపై సుశోభితమగుగాక ! నీవు చిత్తోడు మహారాణా వైనావు ఉదయ్ ! (పన్నా రాజమకుటం ఉదయుని ధరింప జేస్తుంది.]

జయ : నీ పవిత్ర బలిదానము కారణంగా ఈరోజు చరిత్రలో అమర మయింది అమ్మా !

పన్నా : సర్దార్ జయసింగ్ ! నేను ఇన్నాళ్లనుంచీ గుండెల్లోపెట్టుకుని, క్షణమాత్ర వియోగానికి కూడా ఓర్వలేక, ఒడిదాటి పోకుండా, కంట వత్తిడుకుని కాపాడుకున్న సొమ్ము ఇవాళ నీ చేతుల్లో నొప్ప చెపుతున్నాను.

ఆశా : ఈ దానము నీబలిదానాని కేమాత్రము తీసిపోనిదే.

పన్నా : రావు కర్మచందు ! మహారాణా ! సంగ్రామసింహునికి వలె, నీవుకూడా ఉదయునికి దక్షిణ హస్తమై అతన్ని రక్షించుకో. మీ తండ్రిగారి ఆసనాన్ని అధిష్టించు.

(ఇద్దరు సిపాయిలు బందీ అయి వున్న వనవీర్‌ను తీసుకొస్తారు.)

బహు : ఎవరు? వనవీర్ !

పన్నా : వనవీర్! నీకు స్వాగతం. ఈ పట్టాభిషేక మహోత్సవ సందర్భంలో నిన్ను విడుదల చేస్తున్నాం.
ప్రహరీ! వనవీర్‌ని కట్లువిప్పు!

ఉద : అమ్మా! అమ్మా! ఏమంటున్నావు?

పన్నా : ఔను, ఉదయ్! ఏమీ పరవాలేదు.

(ప్రహరీ వనవీర్ కట్లు విప్పుతాడు. వనవీర్ పన్నా పాదాలమీద పడతాడు.)

వన: క్షమించుతల్లీ! నేను నీ పట్ల కూడా పెద్ద అపచారం చేశాను.

బహు: పన్నా! ఇతడు నీ యేకమాత్రపుత్రుణి మింగి వేశాడు. ఇతన్ని క్షమిం...

పన్నా: ఔనౌను. మీరుకూడా క్షమించండి. అందుమూలాంగన్న ఈ పట్టాభిషేకోత్సవం మంగళమయుం కాగలదు.

వన: భయపడకు ఉదయ్! నేనీ క్షణాన్నే మేవాడే కాదు, రాజస్థానమును కూడా విడిచి వెళ్ళి పోతున్నాను. నీ సుఖ జీవితంలో నా నీడకూడా పడదు. సెలవు.

[పోబోతాడు]

జయు: ఆగు, వనవీర్! రణజిత్తు తన అవసాన కాలంలో ఇది నీ కివ్వమని యిచ్చాడు.

[శీతలసేని లిఖిత పత్రం యిస్తాడు. వనవీర్ నిష్క్రమిస్తాడు.]

బహు: ఇక మన ఈ ఆనందోత్సవం నృత్య గీతములతో పరిమళించును గాక!

[పొడుం పీలుస్తాడు.]

బాలికలు ప్రవేశించి నృత్య గీతాలు ఆరంభిస్తారు.]

మాల్కోస్ — త్రితాళం.

రాజా! మనుమా చిరంజీవివై,

రాముని వలె ప్రేమ పాలకుడవై,
ధర్మజుగతి న్యాయ దేశికుడవై,
నుతిగనుమా పాప మారకుడవై,
మా జీవము లిలియిత్తుము నీకై.

చెలగుత నీ గుణ గానమె అంతట,
వ్యాపించుత నీయశ మింటింటా,
దీవనలిత్తురు గావుత పేడ్కన్,
దివి దేవగణము ప్రసన్నంబై.

దేశము సకల కళాభాషితమై
ప్రజలు సదా సంపత్ శోభితులై
మనసులు నిర్మల నిర్భయ గతియై
యలరు గాత ఆచంద్రార్కములై.

బాలికల స్థిరనాట్యం.

—[ తెర ]—

సమాప్తము

భారత ముద్రణాలయము, విజయవాడ - 2.